# ఆదవాని

## కథ



ప్రకటన కర్త

ఎస్. గుడి

**S. GUDI**



Printed at
Sri Vyasa Press, Tirupati.

**1936.**

శ్రీః

# ఆదవాని
# కథ



ప్రకటన కర్త

ఎస్. గుడి

**S. GUDI**



Printed at
Sri Vyasa Press, Tirupati.

1936.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాద్యనేకగుణగణాలంకృతులును శ్రీమదుత్తరాది మఠాధీశులునగు శ్రీసత్యధ్యాన తీర్థపూజ్యపాదుల వారీపురమునకు (ఆదవానికి) యువ సం॥ మార్గశీర్ష శుద్ధ ౧౦లు దిగ్విజయము చేసిరి. యథావిధిగ నశేషాస్తికసంఘమునకు ప్రతిదినము సాయంకాలము ధర్మోపదేశమును చేయుచుండిరి.

ఈకాలమున ఈయూరి అద్వైతప్రబోధక సంఘమువారు శ్రీవారి ధర్మోపదేశమునువిని సహింపనేరక అద్వైతప్రాశస్త్యమును గురించి ఉపన్యసింతురని ఈక్రింది ఆహ్వానపత్రికను పంచిపెట్టిరి.

శ్రీరస్తు.

శ్రీ శ్రీజగద్గురు శ్రీమచ్ఛంకరాచార్యభగవత్పూజ్య పాదేభ్యోనమః

అద్వైత వేదాంత మహాసభ.

ఆహ్వాన పత్రిక.

11-12-1935 తేది నుండి ప్రతిదినం సాయంకాలము 5—30 ఘంటలకు శ్రీ కొండా విశ్వనాథస్వామి దేవాలయమునందు.

అద్వైత ప్రాశస్త్యము

గూర్చి పండితులుపన్యసింతురు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యముల వారు విచ్చేసి వేదాంతోపన్యాసములవిని ధన్యులయ్యెదరుగాక.

అద్వైతప్రబోధకసంఘము, ఆదవాని 10-12-35. — ఇట్లు, కార్యనిర్వాహకులు.

పైఆహ్వానపత్రికను జూచి ద్వైతపండితులు కొందరు అద్వైతప్రాశస్త్యమును గూర్చి విచారముజేయుటకు నభిలషించినవారై ద్వైతసంఘ ప్రమోదిని సభవారిని అద్వైతసంఘముతో నేర్పాటుచేయ గోరిరి. దానిపై ద్వైతసంఘ ప్రమోదినీ సభవారు సదరు అద్వైతోపన్యాసములకు ద్వైతపండితులు విచారము కొరకై రావచ్చునా? యని

లేఖమూలకముగ అద్వైతసంఘాధ్యక్షుడైన మ| రా|రా|| శ్రీ వై. గోవింద రావుగారిని అడుగగా వారు సదరు లేఖను రెండు రోజులు తమ యొద్దనే నుంచుకొనిన తరువాత తాము తాత్కాలిక సభాధ్యక్షులనియు, స్థిరముగానుండిన సభాధ్యక్షులకు ఆలేఖను పంపుకొనవలయునని వాపసు పంపిరి. తరువాత ద్వైతసంఘాధ్యక్షుడు అద్వైతసంఘమునకు ఖాయముగా నుండు అధ్యక్షులెవరో వారికి ఈలేఖను పంపవలెనని మరల మ| రా| రా|| శ్రీ వై. గోవిందరావుగారిని వ్రాతమూలకముగా వేడిరి. ఇట్లు పంపిన మూడురోజులకు, అద్వైతసంఘము వారినుండి యొక అనామకమైన లేఖ పంపబడెను. ఆలేఖయందు అద్వైతసభలకు ద్వైతపండితులు వచ్చుటకు వీలులేదనియు, వారికి కలిగిన సందేహములు సివిల్ కేస్ 1, 2, ఇష్యూలఖండనమగు అసత్యధ్వాంతభాస్కరమను పుస్తకమే తీర్చునని యు ప్రత్యుత్తరమీయబడియుండెను. ఆలేఖయనామకమై యుండుటంజేసి సంతకముల జేసి పంపబడుటకుగాను వాపసుపంపబడెను. కాని, ఆలేఖ సంతకములు చేయబడి ఇంతవరకును పంపబడలేదు

అనంతరము ద్వైతసంఘప్రమోదిని సభవారు ఈక్రిందివిధముగ ప్రకటించిరి.

ప్రకటన

ద్వైతసంఘ ప్రమోదినీ సభా, ఆదవాని

ఈదినము [16—12—35] నుండి ప్రతిదినము సాయంకాలము 5 ఘంటలనుండి శ్రీవేంకటాపురాంజనేయస్వామి దేవాలయమున శ్రీమత్పరమహంస పరివ్రాజకత్వాద్యనేకగుణసంపన్నులగు శ్రీమదుత్తరాది మఠస్వాములవారు సార్వజనికసభయందు

« అసత్య ధ్వాంత భాస్కరమును'' (సివిలు కేసు 1, 2 ఇష్యూల ఖండన గ్రంథమును) ఖండించుచున్నారు. శ్రీపూజ్యపాదులవారు పైఖండన గ్రంథమెంతమాత్రము సరిగాలేదని ప్రదర్శించుచున్నారు

కనుక పైఖండన గ్రంథకర్తలుకాని, వారిపుస్తకమును సమర్థించుకొనను
నభిలాషగలవారెవరేకాని శ్రీవారిసమ్ముఖమున చర్చచేయవచ్చును.
వారికన్నియనుకూలములు చేయబడును

ఆస్తికులందరు పైవిషయచర్చను వినంగోరబడుచున్నారు.

ఆదవాని
16—12—35

ఇట్లు,
ద్వైతసంఘప్రమోదినీ సభా.

పైప్రకటన మేరకు (శ్రీఉత్తరాదిమఠస్వాముల వారు అసత్యధ్వాంత
భాస్కరమును మహాసభయందుఖండించిరి అనంతరము శ్రీఉత్తరాది
మఠస్వాములవారు తిరుపతియందు జరుగనున్న పండితసభకు బోవుటకు
ప్రయాణాసక్తులై యుండిన దినమున అద్వైత సంఘసభ్యులగు శ్రీయుత
ఎ పుట్టప్పగారును, మూగల దొడ్డి జాగీరుదారు బ్రహ్మశ్రీ రామచంద్ర
భట్లుగారును 19_12_35 తేది ప్రాతః కాలమున 10 ఘంటలప్పుడు
శ్రీమదుత్తరాది మఠాధీశుల సమీపమునకు వచ్చి ద్వైతాద్వైత విచా
రముకొరకు గుంటూరు మాంతాచార్యస్వాములవారికి దెలిపినా
మనియు "70 రూప్యముల నంపిన వచ్చెదమని వారు తంతి మూలక
ముగ దెలిపియున్నారు" అనియు చెప్పుచు శ్రీవారికి తంతినికూడ చూపించి
"సదరు మాంతాచార్యస్వాములవారికిని, మీకును (శ్రీఉత్తరాదిమఠ
స్వాములవారికిని) ద్వైతాద్వైతవిచారము జరుగవలెను అని ప్రార్థించిరి.
ఇంతయే గాక "స్మార్తులమగు మేమందరమును సాయంకాలమున
శ్రీవారిదర్శనమునకు సభావ్యవస్థచేయుటకు వచ్చుచున్నాము. అందులకై
మేమందరమును (స్మార్తులందరును) శ్రీవారినుండి శ్రీముఖముల
నిరీక్షించుచున్నాము" అనియు విన్నవించిరి. శ్రీముఖముల నెవరెవరికి
బంపవలెనో వారిపేర్లయొక్క జాబితానుగూడ వ్రాయించిపోయిరి.
జాబితాప్రకారము శ్రీవారిసన్నిధినుండి శ్రీముఖములు పంపబడినవి.
వీరు ఇట్లు సాయంత్రము శ్రీవారిసన్నిధికి వచ్చునంతలో అద్వైతసంఘము

వారొక బహిరంగలేఖను బ్రకటించి యూరిలోనందరికి బంచిరి.
ఆబహిరంగలేఖ ఈక్రింద ప్రకటింప బడినది.

—:శ్రీరస్తు:—

శ్రీ మత్పరమహంసేత్యాది బిరుదాంకితులును, ఉత్తరాది మఠాధీశు
లునునగు శ్రీసత్యధ్యానతీర్థులవారి దివ్యసన్నిధానమునకు
ఆదవాని అద్వైతి ప్రబోధక సంఘ కార్యనిర్వాహకులు వ్రాయు

# బహిరంగ లేఖ.

మేము నిన్నటిదినమువరకు మాఅద్వైత వేదాంతమహాసభా సప్తాహ
మహోత్సవ కార్యక్రమమునందుండుటంబట్టి మూప్రకటన పత్రికలకు
సరియగు జవాబునిచ్చుట కవకాశము లేకపోయినది. తాము తమ
శిష్యులచేత మమ్ములను మీసభలకు చర్చచేయుటకు రమ్మని చెప్పిపంపితిరి
కాని, అదెంతమట్టుకు సత్యమేయని శంకించి, లిఖితపూర్వకమైన ఆహ్వాన
మునుబంపుడని. పునః యెన్నిమారులో చెప్పి పంపితిమి కాని యింతవరకు
ఆహ్వానము లేనందున మీసభకు రానిచ్చయింపక పోతిమి.

ఇట్లుండ 16—12—35 తేదీన మీసంఘమువారిచే బ్రకటింప
జేయబడిన కరపత్రములో అసత్యధ్వాంతభాస్కరమును (సివిల్ కేసు
ఖండనమును) ఖండించుచున్నట్లును, యెవ్వరేని చర్చించవచ్చుననియు,
వారి కందుబకుఁదగినన్నియనుకూలములు చేయబడుననియు వ్రాయించి
నారు. మీపత్రిక అనామకమై యుండుటంబట్టియు, ఆపత్రికలో
సభానియమములు గాని అధ్యక్షుడుగాని, మధ్యవర్తిగాని ఉన్నట్లు ప్రక
టింపక పోవుటంబట్టియు మీసభకు సక్రమ చర్చజరుపుటకు రానవ
కాశము లేకపోయినది.

ఇప్పటికైనను పణనిర్ణయపూర్వకముగ నియమబద్ధమగు సభను
ఏర్పాటుచేయునెడల శ్రీమత్పరమ హంసేత్యాది బిరుదాంచిత శృంగేరీ

శ్రీమదుపాస్య శ్రీవిద్యాశంకరపదమూవేశ ప్రకాశిత జగద్గురు శ్రీకల్యా నందభారతీ మహాంతాచార్యస్వాములవారితో గూడ మేము మిమ్ములను ఈ గ్రామమునందలి సభలో వాదోప వాదములు జేయనెదుర్కొనుటకై సంసిద్ధులముగా నుండఁగలమని ఉబహిరంగలేఖ మూలకముగా తెలుపుట యైనది

17—12—35 తేదినాటి మాసభలోఁగూడ "నియమ బద్ధముగాని సభకుఁబోవుట భావ్యముగాదు" అని సర్వులు నేకగ్రీవముగాఁ దీర్మానించియున్నారు.
మీరీగ్రామమున సక్రమమగు సభను జరుపనిచ్ఛగింతు రేని 3 దినములు ముందుగా మాకుఁదెలుప వలయును.

ఆదవాని
అద్వైతి ప్రబోధక సంఘము,
19—12—1935.

ఇట్లు,
కార్యనిర్వాహక సభ్యులు
1. ఎం. వాసుదేవశాస్త్రులు మఠాధికారి.
2. కథాసాగరం చిదంబరభట్లు
3. ఆదిరాజు భీమరావు
4 వై. గోవిందరావు వకీలు.
5. డి. గోవిందస్వామిరావు. వకీలు
6. అలూరు సాధుశ్రీనివాస శాస్త్రిలు
7. మొదలి. సుబ్రమణ్య శాస్త్రిలు
8. కోసిగి రామచంద్రభట్లు జహగిర్ దార్ మూగలదొడ్డి
9. గుడి. హనుమంతభట్లు
10. తెక్కలకోట గణేశభట్లు

ఉదయం 10 ఘంటలకు శ్రీవారితో చెప్పిన ప్రకారము. (జాబితాప్రకారము.) శ్రీముఖములను అందుకొనిన అద్వైతులందరురాక శ్రీయుత పుట్టప్పగారును, బ్రహ్మశ్రీ ము॥ జా॥ రామచంద్రభట్లు ఈక్రింది

పత్రికలో ప్రకటింపబడిన అంశములను శ్రీవారితో మాట్లాడుకొని పోయిరి.

—: శ్రీః :—

ఆదవాని అద్వైతప్రబోధక సంఘ కార్యనిర్వాహకుల సంతకములు చేయబడిన బహిరంగలేఖ ఒకటి 19-12-35 సాయంత్రం 6 గంటలకు శ్రీవారికిని జనులకునుపంపిన తరువాత వారిలో చేరిన కోసిగి రామచంద్ర భట్లు జహాగీరుదారును, పుట్టప్ప అనువారు ఇద్దరు మ॥ తానాజి వెంకోబ రావు ఇంటికివచ్చి, కోసిగి రామచంద్రభట్లు శ్రీఉత్తరాది మఠాధీశుల వారి సన్నిధికి వచ్చి శ్రీవారితో రామచంద్రభట్లు మాటలాడిన వివరములు:—

" శ్రీమదుత్తరాది మఠాధీశులకును, గుంటూరు శ్రీమాంతాచార్లు స్వాములువారికిని, ద్వైతాద్వైత వాదములో ఆదవానిలో ఆదివారము అనగా 22-12-35 నాడు సమక్షమున బహిరంగ సభలో చర్చజరుగవలసినది. ఆసభలో వాదముచేయు ఉభయులు సమక్షముగా ప్రశ్నోత్తర రూపములతో జరుపవలసినది. ఆజరిగిన ప్రశ్నోత్తరములను లిఖిత మూలకముగా నుంచి దానికి వాదముచేయు ఉభయులు సంతకముల చేయవలయును, ఇట్లు చేసిన దానియందు యేర్పాటుచేసుకోబడిన 5 (ఐదు) సభ్యులసంతకములతో గూడ ప్రకటించవలయును. ఇట్లు ప్రకటింపబడిన ప్రశ్నోత్తరముల ఫలితార్థమును (తత్వనిర్ణయమును) జనులు నిర్ణయించుకొందురు గాక. పైవివరములు నేను రేపు (20-12-35) 7 గంటలకు గుంటూరుకు బయలుదేరి శ్రీమాంతాచార్లు వారికి పై విషయముల దెలిపి వారికార్యక్రమముల కామోదించివచ్చునదియు లేనిదియు 21-12-35 తేది పగలు 10 గంటలలోగా లిఖితమూలకముగా శ్రీవారి సన్నిధికి తెలుపుచున్నాను. అట్లు సమాచారము తెలుపుట తప్పినయెడల శ్రీవారు తిరుపతి సభకు

దయచేయవచ్చును" అని చెప్పి పోయినారు.

ఈవిషయములు సభలో చేసి అందరమువిని సంతకముచేసినాము. రామచంద్రిభట్లు కట్టకడకు సంతకముచేయుటకు వెరచి "మాంతాచార్ల తోలి తెచ్చెదనని ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను. దస్కతు చేసిరావద్దని మా అద్వైతులు చెప్పియున్నారు గనుక చేవ్రాలుచేయను" అని చెప్పియున్నారు.

ఆదవాని
19-12-35 P.M. }

| | |
|---|---|
| యస్. రఘునాథరావు | వెంకణ్ణాచార్య కొబ్బల |
| పి. శ్రీనివాసరావు | తానాజి వెంకోబరావు |
| యస్. మధ్వేశాచార్లు | యం. భీమసేనరావు |
| తానాజి శ్రీనివాసరావు | జి. వెంకోబరావు |
| పత్తికొండ జో॥ నారాయణాచారు | తిరకప్పాచారు రాయిచూరు |
| పద్మనాభాచారు డొంబళ | కె. వెంకోబరావు |
| ఎ. రామరావు | అంబళడాగె వన్నప్ప |
| బి. శేషగిరిరావు | జయరామాచారు మలకేడి |
| కె. రాఘవేంద్రాచారు | దేశపాండె పుట్టూరావు |
| టి. పూర్ణప్రజ్ఞాచారు | సూ. సీతారామాచారు |
| సి. శ్రీనివాసరావు | యం. గోపాలాచారు B.A. |

ఇట్లు రామచంద్రిభట్లు ఏర్పాటు చేసుకొని గుంటూరు శ్రీమాంతాచార్య స్వాములవారిని పిలుచుకొని వచ్చుటకు గుంటూరికి పోయి తాము చెప్పిన ప్రకారము 21—12—35 వ తేది పగలు 11 గంటలకు శ్రీ ఉత్తరాది మఠస్వాములవారికిని అద్వైత సంఘములో భాస్కరశాస్త్రికిని తంతీవార్తలనంపిరి.

వారికిని శ్రీఉత్తరాది మధ్వస్వాములవారికిని వాదోపవాదములు జరుగును.

శ్రీ ఉత్తరాది మఠస్వాములవారికి రామచంద్రభట్లు ఇచ్చిన తంతి నకలు.

Guntur ... 21-12-35 Uttaradi Swami 9-25-9-57

ADONI

Jagadguru arrives Sunday BE PREPARED

Ramachandra bhat, Jahgirdar

భాస్కరశాస్త్రికి ఇచ్చిన తంతి.

Guntur 21-12-35 Bhaskara Sastri 9-25-9-58

ADONI

Jagadguru arrives Sunday morning wait Guntakal

Ramachandra bhat

పై భాస్కరశాస్త్రిలవారికిచ్చిన తంతివార్తను అద్వైతసంఘ సభ్యులగు శ్రీయుత పి. శివరామయ్య, శ్రీయుత పి. నారాయణరావు గారును నాకు (యం భీమసేనరావుకు) వచ్చి చూపిరి. ఈవార్తనుకూడ శ్రీవారికి విన్నవించుకొంటిని.

శ్రీవారు (ఉత్తరాది మఠస్వాములవారు) తమ పేరటపంపిన తంతివార్తను జూచి రామచంద్రభట్లుచే నేర్పాటు చేసుకొన్న ప్రకారము సభ జరుగ నున్నదని నిశ్చయించుకొని 26-12-35 వ తేదీలనుండి తిరుపతియందు తమచే జరుపబడనున్న పండితసభకు పోవుట మాని ఇచ్చట నే నిలిచిరి ఆరోజుననే అద్వైత ప్రబోధక సంఘమువారు ఈ క్రింది ప్రకారము సాయంత్రము 4 గంటలకు ప్రకటన గావించిరి.

—: శ్రీః :—

శ్రీశంకరో విజయతే

బ్రహ్మశ్రీ

రాజశ్రీ............................................................................గారికి

మహాశయులారా!

22-12-35 తేది నుండి ద్వైతాద్వైత సభలు ఆదవాని పురమున జరుగనున్నవి. గుంటూరు శ్రీకల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వాములు

అద్వైతమునకు విజయముగల్గునట్లు చేయుభారమందరిది. తత్క్షణమే బయలుదేరిరావలెను. పండితులగు వారికి మార్గభత్యములు గూడ నీయబడును. విశేషించి వ్రాయుట అనవసరము.

| | |
|---|---|
| అద్వైతప్రబోధకసంఘము<br>ఆదవాని<br>20—12—35 | ఇట్లు విన్నవించు<br>కథాసాగరం చిదంబరభట్లు<br>కార్య నిర్వాహక సంఘసభ్యుడు |

ఇట్లు ప్రకటించిన దినమే మరలరాత్రి 9 గంటలకు ఈక్రింది విధముగ అద్వైత ప్రబోధక సంఘముచే ప్రకటింప బడెను.

—: శ్రీరస్తు :—

ఆ హ్వా న ప త్రి క .

శ్రీమత్పరమహంసేత్యాది బిరుదాంకిత శృంగేరీ
శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత

జగద్గురు శ్రీకల్యాణనంద భారతీ మహంతాచార్య స్వాములవారు 22—12—35 తేది భానువారము 9 గంటల రైలుకు గుంటూరు నుండి ఆదవానిపురమునకు విజయము చేయుచున్నారు. బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య ప్రజలు శ్రీవారికి స్వాగతమిచ్చుటకై రైలుస్టేషనుదగ్గరికి రావలయును.

22—12—35 సాయంకాలము 4 ఘంటలకు శ్రీకొండావిశ్వనాథ దేవాలయమునందు పై శ్రీవారి యధ్యక్షత క్రింద నొక మహాసభ జరుగును. సభ్యులు విచ్చేయ ప్రార్థితులు.

| | |
|---|---|
| అద్వైతప్రబోధక సంఘము,<br>ఆదవాని<br>21—12—35 | ఇట్లు విన్నవించు,<br>కార్య నిర్వాహక సంఘసభ్యులు. |

ఈ ప్రకటనను జూచి శ్రీయుత సి. శ్రీనివాసరావు గారు ఈ క్రింది విధముగ ప్రకటించిరి:—

## ప్రకటన.

అద్వైతి ప్రబోధక సంఘ కార్యనిర్వాహక సంఘసభ్యులవారి తరపున మ। ॥ సూగల దొడ్డి జాహగీరుదారు గారగు రామచంద్రభట్లు గారు శ్రీఉత్తరాది మఠాధీశుల వారితో 19—12—35 తేది 7 P.M. కు మాటలాడినరీతిగ శనివారము ఉదయము తంతిద్వారా శ్రీవారితో ద్వైతాద్వైతవివాదముల సలుప గుంటూరు శ్రీకల్యాణానందులవారు ఆదివారము వచ్చుచున్నారనియు, సదరి వాదములు సలుప సిద్ధులుగా నుండవలెనని తెలిపిరి. ఈతంతి వార్తవినియు, మరియు 20-12-35 తేదీలు అద్వైతి సంఘమువారు ప్రకటించిన ఆహ్వాన పత్రికలోగల (22-12-35 తేది నుండి ద్వైతాద్వైత సభలు ఆదవానియందు జరుగుచున్నవి. శ్రీకల్యాణానందుల వారికి శ్రీఉత్తరాది మఠాధీశులకును వాదోప వాదములు జరుగును అను) అంశములను చూచి ఇట్టి సమయమును ఎదురు చూచుచుంటిమి. తిరిగి అద్వైత సంఘమువారు 21-12-35 తేది పంచిన ఆహ్వాన పత్రిక మూలకముగా 22-12-35 తేది సాయంకాలము 4 గంటలకు మహాసభ శ్రీ కల్యాణానందులవారి అధ్యక్షత క్రింద జరుగునని తెలిపినదానిని చూడగా పూర్వము బళ్ళారి నగరమునందువలె ఏలాటి సమక్షమ వాదములు జరుగక పోవునట్లు ఇప్పుడు కూడ కలుగునేమోయని అనుమానము కలిగినది.

అందువలన సభ్యులకు కావలసిన తత్వనిర్ణయమును సభయందు వాదోప వాదములుగ జరిపి అందరికి ఆనందము కలిగించు భాగ్యము నేడు కలుగవలెనని దేవుని ప్రార్థించు చున్నాము.

ఆదవాని, 22—12—35. } సి శ్రీనివాసరావు.

అనంతరము శ్రీ గుంటూరు స్వాములు 22-12-35 వ తేది నాడు మదరాసు మెలునకు ప్రాతఃకాలము (సుమారు 10 ఘంటలకు) ఆద

వానికి విచ్చేసిరి. వారిని పురములోనికి పిలుచుకొని వచ్చు మార్గము నందే ఈక్రింది నోటీసును పంచిపెట్టిరి.

దిగ్విజయయాత్ర.

ఉత్తరాదిస్వాములను మధ్వస్వాములు బళ్ళారిజిల్లా ఆదవాని పురమున(గావించుచున్న కలవరమును వారించుటకై ఆదవాని అద్వైతి ప్రబోధక సంఘమువారిచే పంపించ(బడిన నేను శ్రీవిద్యాశంకర పదమా వేశ ప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానందభారతీ మాంతాచార్య స్వాములవారిని దిగ్విజయమునకై నేటి సాయంకాలమున 7-30 గంటల రైలుమీద ఆదవానికి తోడ్కొని పోవుచున్నాను గావున నట్టి మహోత్సవమును జూచి యానందించుటకై వైదిక ధర్మానుయాయు లెల్లరును విచ్చేయ ప్రార్థితులు.

| | |
|---|---|
| మకాం: గుంటూరు,<br>21—12—1935. | ఇట్లు,<br>రామచంద్రభట్లు.<br>మూగిలదొడ్డి జహాగీర్‌దారు, ఆదవాని. |

ఇట్లు శ్రీ మాంతాచార్య స్వాములవారు విచ్చేసినదినమున సాయం కాలము సుమారు 3 ఘంటలకు నేను (యం. భీమసేనరావు) వారి సన్నిధికిపోయి తాము శ్రీఉత్తరాది మఠస్వాములవారితో చేయు వాదముల నియమములనుగూర్చి ప్రస్తావించితిని.

అందులకు (శ్రీకల్యాణానందభారతీ) వారు "ఆదవాని అద్వైత ప్రబోధక సంఘమువారు అద్వైతమత విషయోపన్యాసములకుగాను నన్ను పిలిపించిరేకాని శ్రీఉత్తరాది మఠస్వాముల వారితో ద్వైతా ద్వైత చర్చలకుగాను తమ్మెన్నయూరికి పిలుచుకొని రాలేదనియు, వాద విషయమై రామచంద్రభట్లు గారు తమతో నేమిచెప్పలేదనియు కనుక తాము వాదమునకు రామనియు శెలవిచ్చుటయేగాక అట్లు మీస్వాము లవారు మాతో వాదము చేయుటకు ఇచ్ఛకలిగియుండిరేని వారట్లు

ప్రకటనమూలకముగ దెలిపిన వత్తుమని రామచంద్రభట్టుగారి సముఖ మునసే చెప్పిరి ఈయుదంతమంతయుపాంతముగ శ్రీ॥ ఉత్తరాది మఠాధీశులసన్నిధిని విన్నవించితిని

ఆదినము రాత్రి 22–12–35 న తేది సుమారు 8 గంటలకాల మున ఈక్రింది బహిరంగలేఖను శ్రీమదుత్తరాది స్వాములవారికి అర్పించిరి.

బళ్ళారిజిల్లా ఆదవాని అద్వైతి ప్రబోధక సంఘమువారు శ్రీఉత్తరాది మఠస్థులగు శ్రీసత్యధ్యానతీర్థులవారికి వ్రాయించిపంపిన బహిరంగ లేఖ.

మీరు మార్గశీర్ష శు॥ ౧౩ నాడీగ్రామమును ప్రవేశించినది మొదలు బహుళ 2 మంగళవారమువరకు ఈపురమున గావించిన వైదికనిందకు మామనంబులు తల్లడిల్లి సంతాపమును జెంద, నట్టి సంతాప మునుండి మమ్ములను తొలగించి మామనంబులకు శాంతిగలుగజేయ నీయాదవానీపురంబునకు దిగ్విజయయాత్రకై దయచేయగలందులకు ప్రార్థించుచు 17-12-35 తేదీన శ్రీశ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష విద్యాశంకరపద మావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతా చార్యస్వామి పూజ్యపాదులవారికి తంతినిచ్చి యుంటిమి. అందులకు వారనుగ్రహించి నేటి యుదయ మీపురమునకు విజయము చేసియున్నారు.

మాజగద్గురువులన్ననో మీచేద్వైతమనియు వైష్ణవ సిద్ధాంత మనియు ననుమాటలచే నార్భాటముచేయు మతము స్వరూప స్వభావ ములనెంతమాత్రము కలిగియుండక శశవిషాణతుల్యముగా నొప్పుచున్న దనియు సంయమనీపురము హైకోర్టులో విష్ణుదాసరూపమున మీచే దాఖల్ చేయబడినప్లయింటులో నుదహరింపబడిన మతస్వరూపము

మహాత్మ్యాదీయుల యొక్కయు క్రైస్తవులయొక్కయు మతస్వరూపము లతో తుల్యముగానుండుటం జేసి మీ మతము ప్రచ్ఛన్న మహాత్మ్యదీయ క్రైస్తవము నామముచే పేర్కొనబడుటకు యోగ్యత కలిగి యున్నదనియు, దానంజేసిమీమతము అవైదికమైనచార్వాక మతమే యగుచున్నదనియు సర్వవిధముల నధిక్షేపించియున్నారు.

అట్టి యధిక్షేపములనుంచి మీమతమును రక్షించుకొనవలయు నని 1935 సంవత్సరమున ఏప్రిల్ నెల 25-26-27 తేదీలలో బహిరంగ సభలో శ్రీమాజగద్గురువులవారు ప్రతిజ్ఞాపురస్సరముగా గూడ సెలవిచ్చి యున్నారు. అప్పుడు మీరచటినుంచియే అట్టియధిక్షేపములకు మౌన ముద్రను ధరించియుంటిరి. పిమ్మట జగద్గురువులు గుంటూరు పురమునకు విచ్చేసి 3-12-35 తేదిగల 12 వ శాసనమును ప్రవర్తింపజేసియున్నారు.

అట్టిజగద్గురువుల 12 వ శాసనమునుగూడ మీరొకింతయేని శ్రద్ధతోఁజూచినట్లుకన్పడదు. అట్లుచూచియున్నచో 19-12-35 తేదిన మీ కంపబడిన బహిరంగలేఖకు మీరు యువనామ సంవత్సర మార్గశీర్ష ౬నాడు మాసంఘమువారికి ప్రత్యేకముగ నాహ్వానముల బంపించి యుండరు. ఏదిఎట్లులైనను జగద్గురువుల శాసనమననుసరించియు మాసభవారు 17-12-35 వ తేదిన జేసిన తీర్మానము ననుసరించియు మీయాహ్వానమును లక్ష్యపెట్ట నవసరముకాన్పింపదు. ఇది యిట్లుండ 19-12-35 తేదిన రాత్రి 7 గంటలకు మ కోసిగి రామచంద్రభట్లు జహగీర్ దారును మః పుట్టప్పగారు అనువారిద్దరు మిమ్ములనుగలసి నట్లును అందు మః రామచంద్రభట్లుగారు మీతో కొంతప్రసంగ ము గావించినట్లును ఒకపత్రికను యస్. రఘునాథరావు మొదలగు వారు ప్రకటించియున్నారు. ఆపత్రిక సర్వవిధముల సత్యేతరముగా నున్నది కావున ఇకముందు ఇతరులచే నట్టిపత్రికలవ్రాయించి ప్రక టింపక మా శ్రీజగద్గురువు వారధిక్షేపించిన మేరకు మీమతస్వరూప

స్వభావములనూ ప్రస్థానత్రియ ప్రమాణ పురస్సరముగ నిరూపించుచు, మేము 19-12-35 వ. తేదీన ఇచ్చిన బహిరంగ లేఖలో కోరిన రీతిన వ్రాతమూలకమగు ప్రత్యుత్తరమును మీ దేవాలతో పంపుదురేని యుత్తరకార్యక్రమమును నిర్ణయించుకొనవచ్చును.

ఈవిషయములనే 22—12—35 తేది పగలు 3-30 గంటలకు మా శ్రీ జగద్గురువులవారి సమక్షమున మీ శిష్యులగు మ॥ లాంగ్లే భీమసేనరావు మొదలగు వారికి చెప్పియుంటిమి.

ఇట్లు

కార్యనిర్వాహక సభ్యులు

1. యం. వాసుదేవశాస్త్రిలు మఠాధికారి
2. కథాసాగరం చిదంబరభట్లు
3. ఆదిరాజు భీమరావు
4. వై. గోవిందరావు వకీలు
5. డి. గోవిందస్వామిరావు వకీలు
6. అల్లూరు సాధు శ్రీనివాసశాస్త్రిలు
7. మొదలి సుబ్రమణ్యశాస్త్రిలు
8. కోశిగి రామచంద్రభట్లు జ॥ మూ॥
9. గుడి హనుమంతభట్లు
10. తేక్కలకోట గణేశభట్లు

ఈ పత్రికను మాలో రామచంద్రభట్లుగారు నేటిరాత్రి 7 గంటలకు సత్యధ్యాన తీర్థులవారికి స్వయముగనందజేసి నంతలోనద్దానిని వారు తమనద్దనున్న మ॥ పడకండ్ల గురురాయాచార్యుల వారిచే చదివించి వినిపించుకొని యందులోకోరినట్లు ప్రత్యుత్తరమిచ్చుటకుగాని తుదకు యాలేఖనందుకొని యుంచుకొనుటకుగాని యంగీకరించక యద్దానిని రామచంద్రభట్లుగారికి వాపసు యిచ్చివేసిరి.

ఆర్యులారా! శ్రీ ఉత్తరాది మఠాధీశ్వరులగు శ్రీసత్యధ్యాన తీర్థులవారికి యాడంబరమాత్రయు నాంతనిరాధారమో సర్వులకు స్పష్ట పడుచున్నదికదా! కావున వారిమతమును శాస్త్రీయపద్ధతిలో వాదించి సమర్థించుకొనలేక లేనిపోని నెపముల పన్ని తప్పించుకొని పోవుచున్నారని తెలిసికొనవలసియున్నది.

దీనివలన నిదివరకు వీరుప్రకటించిన విషయములన్నియు శుద్ధ అబద్ధములని నిశ్చయింప వలసియున్నది.

22—12—35, ఆదవాని. | కార్య నిర్వాహక సభ్యులు అద్వైతి ప్రబోధక సంఘము

శ్రీవారిసన్నిధి యందీ బహిరంగలేఖ చదువబడెను. ఇట్లు చదువబడిన తరువాత నేను (యం భీమసేనరావు) "గుంటూరు స్వాములవారు వేరు విధముగ జెప్పుచున్నారు. సదరు స్వాముల వారే శ్రీఉత్తరాదిస్వాములవారితో నిప్పు మాట్లాడుకొన్న విషయము మాతో యూరు చెప్పలేదని మీరాసమక్షమున నే జెప్పితి. కనుక మీ మాటలపై మాకువిశ్వాసము లేదు. కనుక మూరు తెచ్చిన ఈ బహి రంగలేఖ పై సదరు గుంటూరు మాంతా వాక్యస్వాములవారిచే సంతక ము చేయించుకొనివచ్చిన యెడల మేము త్తర మిచ్చెదమని చెప్పగా వారు (రామచంద్రభట్లు) మాంతా వాక్యస్వాములవారిచే సంతకము చేయించుకొని వచ్చెదమనియు, వాదమునకు సిద్ధముగా నుండవలయు నని చెప్పి తాము తెచ్చిన బహిరంగలేఖను తీసికొనిపోయి చెప్పిన ప్రకారము శ్రీగుంటూరుస్వాములవారితో సంతకము తీసుకొనిరాక సదరు బహిరంగలేఖను అసత్యమగు వార్తలతో. ప్రకటించిరి. అనం తరము శ్రీమదుత్తరాది మఠాధీశులగు శ్రీ సత్యసత్యధ్యాన తీర్థ శ్రీ పూజ్యపాదులవారు వీరు చేసిన అక్రమమునకు వ్యసనపడి వేదాంత విచార వవాల్ (Challenge) పత్రికను ఈక్రింది విధముగ ప్రకటించిరి.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యత్వాద్యనేక గుణసంపన్న శ్రీమద్రామవేదవ్యాస పాదపద్మారాధక శ్రీమద్వైష్ణవ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్య శ్రీమత్ సత్యజ్ఞానతీర్థ శ్రీపాదవడెయర కరకమల సంజాత శ్రీమత్ సత్యధ్యాన తీర్థస్వాములవారినుండి సమస్త అద్వైతి విద్వన్మండలీ వారికి బహిరంగముగా పంపిన,

వేదాంత విచార సవాలు పత్రిక.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యాజీవో బ్రహ్మైవనాపరః"

అని శ్రీ శంకరాచార్యులవారు చెప్పిన 1. బ్రహ్మనిర్గుణము, అనగా సకల ధర్మరహితుడు 2. జగత్తు మిథ్యా బ్రాహ్మణాది వర్ణములు బ్రహ్మచర్యా .... .... .... .... .... బ్రహ్మమునందు కల్పితము. శుక్తిరజతమువలె అసత్యము 3. జీవో బ్రహ్మైవనాపరః, జీవుడు బ్రహ్మమే, బ్రహ్మమునకు వేరుకాదు అను ఈ మూడు అంశములకు, ప్రస్థానత్రయమున ఆధారము లేదు. ప్రస్థానత్రయము, బ్రహ్మకల్యాణగుణపూర్ణుడు, జగత్తు సత్యము జీవబ్రహ్మభేదమునే భోధించుచున్నవని శ్రీశంకరాచార్యుల వారే చెప్పియున్నారు.

గనుక శ్రీశంకరాచార్యులు చెప్పిన మతము అద్వైతమతము వైదికముకాదు.

అద్వైతమతము భౌద్ధమతమే ప్రస్తానత్రయముల వలన సిద్ధింపబడదు. అని వేదాంత విచారణ సివిల్ కేసు అను గ్రంథమునందు చెప్పిన అంశములు స్థాపించుటకు సిద్ధముగా వున్నాము. అద్వైతమతాభిమానులు యెవరైనను పైచెప్పిన మూడంశములును ప్రస్థానత్రయమువల్ల సిద్ధమగుచున్నది అనిమాత్రో విచారమూలకముగా సాధించుకొనవచ్చును. అందుకుగాను యీదినము 23—12—35 తేది సాయంత్రము 4 ఘంటలనుంచి రాత్రి 8 ఘంటలవరకు

రావుసాహేబు తమ్మారెడ్డిగారి సత్రమునందు వచ్చినవారితో విచారము జరుపబడును. అట్లు విచారము ప్రారంభమైనయెడల అదిముగియు వరకు ప్రతిదినము అదేకాలములో అదేస్థళమునందు జరుపబడును. ఈవాదము జరుగునప్పుడు సంతకమునకుగాను ఏర్పాటుచేయబడిన సభ్యులు తప్ప ఇతరులు యెవరును సంభాషణ జేయరాదు. నిశ్శబ్దముగ నుండవలెను. ద్వైతసంఘమువారినుండిగాని ప్రతిసంఘమువారు 25 గురికంటె ఎక్కువమంది సభామందిరమునందు ప్రవేశింపబడకూడదు. వీర్లకు ఆయాసంఘపు కార్యదర్శులు టిక్కెట్లు ఇచ్చియుండవలెను.

వా ద ని య మ ము లు.

వాదము యు ఉభయులు సమక్షముగా సంస్కృతభాషలో ప్రశ్నోత్తరరూపములతో జరుపవలసినది. అజరిగిన ప్రశ్నోత్తరములను లిఖితమూలకముగనుంచి దానియందు వాదముచేయు ఉభయులు సంతకములు చేయవలయును. ఇట్లుచేసినదానియందు యేర్పాటుచేసుకోబడిన 5 సభ్యుల సంతకములతో కూడ ప్రకటింపబడిన ప్రశ్నోత్తరముల ఫలితార్థము (తత్వనిర్ణయమును) జనులు నిర్ణయించుకొందురుగాక.

మకాం అదవాని, 23—12—35 — శ్రీ సత్యధ్యాన తీర్థ శ్రీ పాదులు, ఉత్తరాది మఠము

ఆనవాల్ పత్రికలయొక్క రెండుప్రతులునాకిచ్చి వానిలోనొక దానిని అద్వైతిప్రబోధక సంఘాధ్యక్షులవారికిని మరొక దానిని శ్రీ గుంటూరు మాంతాచార్యస్వామికిని ఇచ్చి వారిస్వీకార చిహ్నముగ వారి సంతకములను తెమ్మని యాజ్ఞాపించిరి. నేను సదరు పత్రికలను గైకొనిపోయి యొకప్రతిని అద్వైతి ప్రబోధకసంఘాధ్యక్షులకు ఇచ్చితిని. వారుదయతో ఆపత్రికాస్వీకారచిహ్నముగ సంతకము చేసి రశీదు ఇచ్చిరి. రెండవప్రతిని శ్రీ గుంటూరు స్వాములవారికి ఇచ్చి అంది.

నట్లు సంతకము చేసి ఇచ్చుటకై మనవిచేసుకొంటిని. వారు సవాల్ పత్రికను చదివి తాము సదరు పత్రికను స్వీకరింపమనిచెప్పి వాపసు ఇచ్చిరి. శ్రీ మధ్వోత్తరాది మఠస్వాములవారు తమచే ప్రకటింపబడిన సత్రమున అద్వైతవాదులు తమతో వాదించుటకు వత్తురేమోయని నిరీక్షించుచుండిరి. రాత్రి 8 ఘంటలవరకు వాదించుటకు యెవరును రారైరి.

తత్వనిర్ణయేచ్ఛ గలిగిన నేను శ్రీ గుంటూరు స్వాములవారిని శ్రీ ఉత్తరాది మఠస్వాములవారిని కలిపి వారిచర్చవలన తేలిన ఫలితమును జనులకు తెల్పనుద్యుక్తుడనై 24—12—35 వ తేది మరల అద్వైతి ప్రబోధక సంఘాధ్యక్షుల దగ్గరకు వెళ్ళి సదరు చర్చకై యేర్పాటు చేయుమని వేడితిని వారు « గుంటూరు స్వాములవారిని మీరేయడుగుడు నేను కార్యాంతరమున బోవుచున్నా" నని చెప్పి గ్రామాంతరమునకు పోయిరి.

తదుపరి నేను కొందరు అద్వైత సంఘసభ్యులతో గూడ శ్రీ గుంటూరి స్వాములవారి సన్నిధికి పోయి మరల ద్వైతాద్వైతచర్చలను గూర్చి ప్రస్తావించి వాదనియమములను మీరే (గుంటూరు స్వాములవారే) యేర్పాటుచేసి అట్లువ్రాసి మీసంతకముచేసి ఇచ్చిన దానిని నేను గైకొనిపోయి శ్రీ ఉత్తరాదిమఠస్వాములవారికి చూపి దానియందు శ్రీవారి శీలును వేయించి ఈ పత్రికను మీకు వాపసు తెచ్చియిచ్చెదనని విన్నవించుకొంటిని. ఇట్లు చెప్పినను వారు సమ్మతింపక « ఆదవాని అద్వైతి ప్రబోధక సంఘమువారు తమ్ము అల్లరిచేసి పిలుచుకొనివచ్చినా" రనియు, «కొమ్మిది అద్వైతమతాధిపతులకు అద్వైతసంబంధమైన ఉపన్యాసములకు మీరు రావలయును లేదా తమ తరఫునుండి పండితులను గాని పంపుమని వ్రాసియుంటిమి వారు రాలేదు. పండితులనైనను పంపలేదు కావున మీరు రావలసినదియని పిలుచు

క్కానివచ్చిరి. నేను వాదమునకు రాను" అనిచెప్పిరి. ఈ మాంతా చార్లవారి వైఖరినిచూచి యద్వైతులలో నొకరు సత్యవాదియను పేరు తో నీక్రిందివిధముగ నొక బహిరంగలేఖను బ్రకటించిరి.

—: శ్రీః :—

శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్యస్వామి వారికి

# బహిరంగలేఖ.

స్వామీ చిత్తగింపుడు.

ద్వైతమతప్రతిపాదకులైన శ్రీ ఉత్తరాదిమఠ స్వాములవారిని వేదాంతవాదమునందు జయింప యీ యూరి అద్వైతి ప్రబోధక సంఘమువారిచే అధిక ఉత్సాహముచే యిచ్చుటకి తోడి తేబడితిరి. ఈ మహావైభవముతో వచ్చిన మీరు వాదించుటకేల భయపడితిరో తెలియకున్నది. దీనివలన సత్యాన్వేషణ పరుడగు నాకీసందేహములు కలుగుటచేత మిమ్ము యిటు ప్రశ్నింపవలసి వచ్చినది క్షమింపుడు.

(1) వ్యయ ప్రయాసలకోర్చి మిమ్ముల నిచ్చుటకి తోడి తెచ్చిన యద్వైతిప్రబోధక సంఘము వారియాశలను మంట గలిపితిరే గదా ?

(2) అద్వైతమతము అప్రమాణమను అభిప్రాయమును మీరే అందరికి కల్పించిన వారయితిరికదా? దీనికుత్తరవాదులు తమరేకదా ?

(3) అద్వైతిసంఘము వారిచే నేర్పాటు గావింపబడిన సభామందిరమున ధాటిగానుపన్యాసముచేసితిరి. మీవాక్చాతుర్యము మెచ్చదగినదేకాని ప్రశ్నలకవకాశమిచ్చితిరా ?

(4) పట్టబాలకెవడైనను ప్రశ్నించిన తగుసమాధాన మిచ్చితిరా?

(5) కోపపడకుడు. మీయందెట్టి భయంకర కోపముకలదో యొకనాడైన గమనించితిరా? న్యాయవిషయమున ప్రశ్నింప మీయట్టి వారికిట్టి కోపముతగునా ఇదితత్వవేత్తలలక్షణమా?

(6) ప్రశ్నవేయునంతనే మీకసరించుటలు చూచి సమావిష్టులైయున్న సభ్యులు ఆగ్రహపరవశులైరని మీరు గ్రహించితిరా లేదా?

(7) ద్వైతమునుగూర్చి నోటికివచ్చిన దుడుకులచే తూలనాడితిరేకాని వేదాదిప్రమాణములచే ఆమతఖండన మొనర్చి సభ్యుల మనోరంజన మొనర్చితిరా?

(8) మిమ్ముల వాదమునందు నెదుర్కొనుట్కై నిలువబెట్టబడియున్న శ్రీ ఉత్తరాదిమఠస్వాములవారు మీకై అనుదినము నెదురు చూచుచున్నారే వారికేమి సమాధానము చెప్పిపోయెదరు? మీరు నేడోరేపో గుంటూరికి పోవనున్నారట ఇటుపోవుటచేత బూకీపురమున గౌరవము హెచ్చెనా? క్షీణమయ్యెనా? లేక ధ్వంసమయ్యెనా? యోచింపుడు

ఇకనైన చిరకాలమునుండి ప్రచారముననున్న మా అద్వైతమత గౌరవమును నిలుపుకొనుడు. మిమ్ముల నాశించి తోడితెచ్చిన వారి కాశాభంగ మొనర్పకుడు. ఇటుచేయనొలరని యికమీద యిట్టి ఘనకార్యములకు బూనకుడని నావినయ పూర్వకమగు మనవి. క్షమింపుడు.

ఆదవాని, 29—12—1938. } ఒక సత్యవాది.

శ్రీమదుత్తరాది మఠాధీశులు సవాలు పత్రికను బ్రకటించి దానిమేరకు, నిర్ణీతస్థల కాలములందు వాదుల నెదుర్కొన సంసిద్ధులై యుండిరి. ఒక్క అద్వైతియైనను రాలేదు. ఈసవాలు పత్రిక వారికి కింతపాళమైయుండెకాబోలు. సందుగొందులయందు వీరిగుసగుసలు

మెండయ్యెను. « మూరిముందఱ ముక్కు తెగు" లన్నట్లు నొక యద్వైత పండితుడును వాదమున కెదురుపడడయ్యె. కల్యాణభారతీ యాద వానినుండి బయటికిబడినచాలును దైవమాయనితలఁబోయుచుండె కాబోలు. ఇట్టితరుణమున తమకోలాహలమున కాలహరణమొనరించు గప్పాలభాస్కరప్పలు కొందఱు వేదాంతవిచార సవాలుపత్రికా ఖండనము అను పత్రికనొకదానిని నీక్రిందివిధముగా సెట్టూరి నరసరామ శాస్త్రిని శునశ్శేఫునిగాజేసి యతనిపేరుతో బ్రచురించిరి.

## ఉత్తరాది స్వాముల సవాలు ఖండనము.

ఆర్యమహాజనులారా!

ఉత్తరాది మాధ్వ మఠాధీశులగు సత్యధ్యాన తీర్థులవారు బళ్ళా॥ జిల్లా ఆదవాని మకాంలో 23-12-35 నాడు ప్రకటించిన «వేదాంతి విచార సవాలుపత్రిక' యను తుక్కు కాగితమును 26-12-35 తేదినాడు సాయంకాలము అకస్మాత్తుగా నేను ఆదవానికి కార్యాంతర నిమిత్తమై వచ్చియుండి చూచితిని. దానిలో «సమస్త అద్వైతి విద్వన్మండలివారికి' అనినిర్దేశింపబడియుండుటచే, దానిని విమర్శించుటలో నాకును సంపూర్ణ బాధ్యతకలదు గనుక ఖండించుటకు గడంగితిని. చాతుర్వర్ణ్యములవారందరును చక్కఁగా గమనించి ఆ వీరి సవాలు పత్రిక కేవల దురాగ్రహ కల్పితమనియు సర్వథాహేయమనియు నెరిగి శ్రీ శాంకర మతాభిమానముకలిగి శ్రేయస్సును బడయుదురుగాక.

మహాజనులారా!

« బ్రహ్మసత్యం, జగన్మిథ్యా జీవోబ్రహ్మైవనాపరః '' ఈ వాక్యము నుదహరించి సత్యధ్యానులవారు, ప్రస్థానత్రయముచే పై వాక్యములోని యంశములు సిద్ధములుకావని నిరూపింతుమనియు, ఎవ

రైనను సాధించుకొనవచ్చుననియు వీరు సవాలు చేసియున్నారు. కాని మొట్టమొదట పై వాక్యమునకు సరియైన శబ్దార్థమే తెలియక వెర్రిపోకడలతో, స్వవ్యాహత వచనములతోను వ్రాయుచుండు ఈ సవాలుదారుల సవాలుకు నిజస్థితిలో ఎవరుగాని జవాబియ్యవలసిన అవసరమే లేదు. అయినను వీరి వేదాంత విచారశక్తిని లోకమునకు వెల్లడిచేయుటకై వీరి సవాలుపత్రికను ఈక్రింది విధముగా ఖండించుచున్నాను.

## 1 బ్రహ్మ సత్యం

దీనికి « బ్రహ్మనిర్గుణము, అనగా సకల ధర్మరహితుడు " అని వీరు అర్థము వ్రాసియున్నారు. పై పదముల కట్టియర్థమును ఏయవ్యుత్పన్నుడైనను చెప్పడు. మరేమన « బ్రహ్మ సత్యమైనది" అను స్వరసమైన అర్థమునే ఏ మొద్దువాడైనను తప్పక పలుకును.

ఇట్లుకాగా « బ్రహ్మసత్యం " అను అంశమును వీరుఖండింతురట! వీరి మతములో బ్రహ్మ సత్యముకాదు కాబోలు. ఆహా! ఆస్తికమహాశయులారా! బ్రహ్మ సత్యముకాదని వాదించు హిందువు భారతభూమిలో ఒక్కడైన నుండడు. అట్టివారిని ‹ అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్ ’ అను శ్రుతిఅసత్కల్పులని శాసించుచున్నది. ఇట్టి వీరు ఆస్తికులట! బ్రహ్మ సత్యత్వవాదము వైదికమత పరమసిద్ధాంతమైయుండగా దానిని ఖండింపబూను మతస్థులను ఏమని పిలువవలెనో చదువరులే యూహింతురుగాక.

# 2 జగన్మిథ్యా

జగత్తుమిథ్యయను రెండవయంశముపైన వీరి సవాలట!
"ప్రపంచోయదివిద్యేత నివర్తేతనసంశయః। మాయామాత్రమిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" (మాండూ. ఉప.) మాయామాత్రం తు కార్త్స్న్యేనా నభివ్యక్త స్వరూపత్వాత్, (బ్ర. సూ. 3-2-3) అవ్యక్తా దీనిభూతాని (గీ. 2 అధ్యా) ఇత్యాది శ్రుతి, సూత్ర, గీతారూప ప్రస్థానత్రయముచే జగన్మిథ్యాత్వము స్పష్టముగా సిద్ధించు చున్నది. ఇట్లుండియు వీరు ఈవాదమును ఖండించెదమనుట ప్రస్థానత్రయ సమ్మతమో, అసమ్మతమో, వైదికమో అవైదికమో చదువరులే యూహింతురుగాక.

ఇదిగాక, వీరిమతకర్తలగు మధ్వరాయలే, బ్రహ్మసూత్ర భాష్య జిజ్ఞాసాధికరణమందు "ఆబ్రహ్మస్తంబపర్యంతం 'అసారం' చాపనిత్యకం విజ్ఞాయ......" ఇత్యాదివాక్యములచే జగన్మిథ్యాత్వ మునే స్పష్టముగా జెప్పియున్నారు. ఇట్లుండగా, దీనిని వీరు ఖండింప బూనుట తమ ఆచార్యవచనవ్యాహతి దోషగ్రస్తమగు చున్నదని చదువరులే యూహింతురు గాక.

# 3 జీవో బ్రహ్మైవ నాపరః

ఇక ఈ మూడవ అంశములో "జీవుడు బ్రహ్మమే బ్రహ్మమునకు వేరుకాడు' 'అని జీవబ్రహ్మైక్యము బోధింపబడియుండుట వలన,' దానిని వీరు ఖండించెదరట! జ్ఞానీత్వాత్మైవమేమతం[గీ 7. అధ్యా] క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి. మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భా

వారోపపద్యతే [13 అధ్యా] ఇత్యాదిగీతలు, శాస్త్రదృష్ట్యాతూప దేశోవామదేవవత్ (బ్ర. సూ. 1 అధ్యా 4 పా) ఇత్యాది సూత్రములు, అనేన జీవేనాత్మనా (ఛాందో) సయశ్చాయంపురుషే యశ్చాసావాదిత్యే, సఏకః [తై] తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి, ఇత్యాది ఉపనిషత్తులు, అనగా ప్రస్థానత్రయమున్ను ఘంటా ఘోషముగా జీవబ్రహ్మైక్యమును బోధించు చుండుటచే ప్రపంచమందెల్ల అత్యంత పవిత్రమనియు తత్త్వసిద్ధాంత రాజమనియు ఆదరింపబడు శ్రీశాంకర జీవబ్రహ్మైక్యవాదమును ఈసవాలుదారులు ఖండించుటయిన నెట్టిదో చదువరులే యూహింతురు గాక.

ఇదిగాక వీరి మధ్వరాయలే తమ సూత్రభాష్య ద్వితీయాధ్యాయములో ప్రథమపాదమున, పృథగధికరణ (తద్గుణ సారత్వాధికరణ) మునందు "జ్ఞానానందాది బ్రహ్మగుణాఏవ అస్యయతః సారః స్వరూపం, అతః అభేదవ్యపదేశః" అని తత్త్వమసి అహంబ్రహ్మాస్మీత్యాది శ్రుతులకు అభేదమే తాత్పర్యమని స్పష్టముగా చెప్పియున్నారు. కనుక అభేదము ద్వైతాచార్యులనబడు మధ్వరాయలకును అభిమతమేయని సిద్ధమగుచుండగా, దీనిని వీరు ఖండింపబూనుట యెట్టిదో చదువరులే యూహింతురు గాక.

ఇట్లు అద్వైతవాదమునకు జేరిన పై మూడు అంశములు ప్రస్థానత్రయముచేతను, మీదు మిక్కిలి మధ్వభాష్యాదులచేతను సిద్ధముగుచుండగా. అద్వైతము అవైదికము, బౌద్ధమతమును అగునని సవాలు చేయుట కేవల సాహసము.

మహాజనులారా! ఇట్లు ఈ సవాలుదారుల మాటలు, వ్రాతలు, చర్యలు మున్నగునవన్నియు ప్రస్థానత్రయమునకును, మధ్వాచార్య వచనములకును, లోక ప్రసిద్ధికిని విరుద్ధములగుటవల్ల ఆస్తిక మహా

జనులచే దూరీకరింపబడవలసియున్నవి. వీరి వేదాంతవిచారణ, సివిల్ కేసు, అను గ్రంథము సర్వవిధములుగా అసంగతమైనదని దేశ మందంతటను నానావిధముల ఖండింపబడియుండుట సర్వవిదితము. అట్లుండియు వీరు తమ వాదమును నిలువబెట్టుకొనుటకై తగిన ప్రతి ఖండన గ్రంథములను శాస్త్రీయ పద్ధతితో రచింపక, ఇట్టి కేవల శుష్క ప్రతిజ్ఞలను ప్రకటించుటలోగల లాభమును చదువరులే యూహింతురు గాక.

ఇక వీరు కడపట కొన్ని వాదనియమములను సూచించి యున్నారు. ఉభయులు వాదమునకు గడంగినపిమ్మట, పరస్పర సమ్మతితో నిర్ణయింపతగినట్టి ఈనియమములను, తామే మొట్ట మొదటనే స్వానుకూలముగా టిక్కెట్లు మున్నగువాటితోకూడ సిద్ధముగా సూచించుటలో నిజముగా వీరికి ఈవాదము జరుగవలెనని యుద్దేశమా, లేక ఏదోయొక తీరున పామరలోకమును మోసపుచ్చి ఊరక ప్రఖ్యాతికొరకై యార్భాటము చేయవలెనని యుద్దేశమా యను దానిని చదువరులే యూహింతురుగాక. ఆదవాని సత్రములో తాముండెదరట! భోగట్టాల (Statistics) ప్రకారము నూటికి డెబ్బదియైదుగురువంతున నుండు ఇండియాలోని అశేషాద్వైతులపైన వీరు సవాలు వేయుదురట. తుదకు ప్రెస్సుపేరుకూడ వేయనియ్యక గుప్తవృత్తితో ప్రకటించిన ఈసవాలుపత్రిక దేశమున కంతటికిని అన్వయించునంతటి విలువకలదియో, మార్కెట్టులోని వంకాయల సవాలుయొక్క విలువకలదియో చదువరులే యూహింతురుగాక.

నిజస్థితిలో ఇయ్యది ప్రాజ్ఞులకు నిరాదరణీయమేకాని సమాధేయముకాదు.

మకాం<br>ఆదవాని.<br>28-12-35

ఇట్లు,<br>అశేషవిద్వన్మండలీ విధేయుడు.<br>సెట్టూరు నరసరామశాస్త్రి, కల్యాణదుర్గం.

కాని యిందలియొక్క విశేషము. ఏమన్న ఈపత్రికలను తమ
యద్వైతులయందును, పల్లెటూళ్లయందున్న పంచాంగంబావలకును
మాత్రము పంచిపెట్టుచూవచ్చిరి. గ్రహచారవశమున సందోకపత్రి
తప్పి ద్వైతసంఘమునబడెను. కొందరద్దానిని శ్రీవారిసన్నిధి నిచ్చిరి.
శ్రీవారు దానిని చూచి యీయూరి అద్వైతశాస్త్రపాండిత్యమునకు
జిరునవ్వునవ్వి తిరస్కారభావముతో నటుపారవైచిరి. శ్రీవారి సవాలు
నకు నద్వైతులు సరియగుజవాబిచ్చిరని పామరులనుకొందురేమో
యను సంశయమునన్ను బాధించుటచే ఆపత్రికకు తగుసమాధానము
యీగ్రంథమునందు నిచ్చితిని. సమక్షమున వచ్చుటకు భయపడు
యీయాదవాని అద్వైతులు నిందలి యాక్షేపణముల నాకు ప్రచుర
ణమూలకముగా తెలిపినయెడల శాస్త్రవాదమునకు దిగుటకు కంకణ
బద్ధుడనై యున్నాను.

—: శ్రీః :—

ఆస్తికమహాశయులారా!

సమస్త జనులు 'సుఖమేవ మేస్యాద్దుఃఖం మనాగపి మాభూత్'
సుఖమే ఎల్లప్పుడు నాకు గలుగనీ. దుఃఖము నొకించుకను గలుగ
రాదు. అని ఇచ్ఛించెదరు. ఆదుఃఖరహితమగు సుఖరూపమగు
మోక్షము 'సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవచ'
(గీ. ౧౦-౪) అని చెప్పినరీతిగ సుఖమును దుఃఖమును ఇచ్చుటకు
ఇవ్వకయుండుటకు సమర్థుడగు శ్రీకృష్ణపరమాత్మునియొక్క అనుగ్రహ
ముచేతనే అగును. ఆ అనుగ్రహము 'పృథగాత్మానం ప్రేరితారంచ
మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి' 'యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తారమీశంపురుషం బ్రహ్మయోనిం' ఇత్యాది శ్రుతులయందును,
'జానాతి పురుషోత్తమం' 'ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చ

భారత' ఇత్యాది గీతావాక్యములందును చెప్పినరీతిగ పరమాత్మ సకల జీవజడాత్మక ప్రపంచమునకు ప్రేరకుడు (నియామకుడు) జీవ జడాత్మక ప్రపంచమునకంటె భిన్నుడు. పురుషోత్తముడు జగత్కర్త. అని తెలుసుకొని అతనినే ధ్యానము జేసి అపరోక్షజ్ఞానమును సంపాదించిననే గలుగును.

'అసత్యమప్రతిష్ఠంతే జగదాహుః' 'ఈశ్వరోఽహం' నేనే ఈశ్వరుడను, జగత్తుమిథ్య యని తెలియు మనుష్యుడు 'ఆసురీం యోని మాపన్నాః' అని చెప్పిన ప్రకారముగ అధోగతిని బొందును. అందు వలన వైదికమగు ద్వైతమతప్రకారముగ ఈశ్వరుని తెలిసికొని పురుషార్థమును పొందును. అవైదికమగు అద్వైతమత ప్రకారముగ 'జగత్తు మిథ్య' 'ఈశ్వరుడు నిర్గుణుడు. జీవునికంటె భిన్నుడుకాడు' అని తెలుసుకొని అధోగతిని పొందకుడు. మీకు ద్వైతము వైదికమో అద్వైతమువైదికమో అను సంశయమున్నచో ద్వైతమతమే వైదికమనియు అద్వైతమత మవైదికమనియు స్థాపించుటకు సిద్ధులైయున్నాము. అని శ్రీ ఉత్తరాదిమఠం స్వాములవారు ప్రసిద్ధిచేయుచు దేశమునందు సంచరించుచుండగా ఆదవానియందుండు కొందరు అద్వైతి జనులు తమ అద్వైతమతము వైదికముయునదని శ్రీ శ్రీ ఉత్తరాదిమఠం స్వాములవారి సమక్షమున వాదముజేసి స్థాపింప నిచ్ఛగలవారై, 'గుంటూరునందుండు మాన్తాచార్యులనబడు స్వాములవారిని వాదము చేయ పిలుచుకొని వచ్చెదము. మీరు తిరుపతికి సభకు పోకూడదు. అని చెప్పి గుంటూరికివెళ్ళి మాంతాచార్యులను సమక్షమున వాదము జేయవలెనని జెప్పకయే ఉపన్యాసము జేయవలెనని చెప్పి మోసపరచి పిలుచుకొనివచ్చిరి. ఆదవానికి వచ్చినపిదప గుంటూరు మాంతాచార్య స్వాములవారు సమక్షమున వాదము చేయుటకు ఒప్పుకొనక యుండుటచే దీనిని ఎట్లుబయినను తప్పించవలెనను వ్యాజముచే 'ఉత్త

రాదిమఠం స్వాములవారు ద్వైతమతము వైదికమయినది అద్వైత
మతము అవైదికమయినది అని స్థాపించెదము అని పత్రికను ప్రక
టించగా, మాంతాచార్య స్వాములవారు వాదమునకు వచ్చెదరు
గనుక ఉత్తరాదిమఠంస్వాములవారు సవాలుపత్రికను ప్రకటించవలె
నని అద్వైతులు వచ్చి చెప్పుకొనగా అదేప్రకారముగ ఉత్తరాదిమఠం
శ్రీ స్వాములవారు సవాలు పత్రికను ప్రకటించిరి. అయినను మాంతా
చార్యస్వాములవారు వాదమునకు రాక బళ్లారిపురమునుండి పలాయము
చేసినట్లు పలాయనమొనరించిరి. ఇంతలోనే నరసరామశాస్త్రిలను
నెవరోనొకరు 'సవాలుపత్రికాఖండనము' అనుపేర అసంగతముగు
నొక పత్రికను ప్రకటించిరి. ఆప్రకటనయందుండు అసాంగత్యము
జగత్తుకు తెలియజేయబడుచున్నది.

## శునశ్శేఫున కుత్తరము.

---

లోకమున ప్రయోజనమునందు రెండువిధములు గలవు ఇష్ట
ప్రాప్తి (పూర్వము లేకయుండు ఇష్టముగలుగుట) అనిష్టనివృత్తి
(పూర్వమునుండు అనిష్టమునశించుట) యని-జీవుడు ఎల్లప్పుడు బ్రహ్మ
స్వరూపముగలవాడని ఒప్పుకొను నద్వైతమతప్రకారముగ బ్రహ్మభావ
మును బొందుట క్రొత్తగగలుగు ఇష్టప్రాప్తిరూప ప్రయోజనము
గాజాలదు. వీరిమతప్రకారముగ బ్రహ్మ నిర్గుణుడు, నిష్క్రియుడు,
ఆనన్దానుభవరహితుడైనందున ఇట్టి శూన్యసదృశమైన బ్రహ్మభావ
మును పొందుటకు ఎవరు ఇచ్ఛించనందున ఇది ప్రయోజనమున్ను
గాజాలదు.

'నాస్తి కస్యచిదప్రబోధః, జగన్మిథ్యా' ఇత్యాది శఙ్కరా
చార్యుల వచనానుసారముగ బ్రహ్మాతిరిక్తమయిన సమస్తము మిథ్య

(కాలత్రయమునందు లేనిది) అయినందున అవిద్య మున్నగు ఎట్టి అనిష్టము ఎప్పుడును లేనందున ఏ అనిష్టనివృత్తిరూప ప్రయోజనము లేదు. ‘ పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి’ ‘ ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ’ అను శ్రుతియందును ‘ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః’ ‘ జానాతిపురుషోత్తమం’ ‘ ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చభారత’ ఇత్యాది భగవద్గీతయందును ‘ బ్రహ్మ సకలప్రేరకుడు, సర్వోత్తముడు, సర్వులకంటె భిన్నుడు’ అను భేదజ్ఞానులైన గురువుల ఉపదేశమువలన బుట్టిన జ్ఞానముచే ప్రసన్నుడైన ఈశ్వరునివలన మోక్షమును బొందును’ అని చెప్పబడియుండుటచే ‘ పరమాత్మ జీవునికంటె భిన్నుడు, ప్రేరకుడు, అను జ్ఞానమునకు సాధకమయిన ఈ సవాల్ పత్రికగూడ దైవీసమ్పత్తిగల సజ్జనులకు (సాత్వికులకు) అత్యన్తప్రయోజనకరమైనను పురుషులకంటె భిన్నుడని తెలిసి మోక్షమునుఁబొందననర్హులై ‘ అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి’ ‘ అసత్యం జగత్’ ‘ ఈశ్వరోఽహం’ ‘ ఆసురీం యోనిమాపన్నామూఢా జన్మని జన్మని। మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాంగతిమ్ ।’ “ బ్రాహ్మణాదివర్ణము, గురుశిష్యభావము మున్నగు జగత్తు కల్ల. నేనే బ్రహ్మ” యని తెలిసికొను అద్వైతిచే చేయబడు ఉపదేశముచే బుట్టిన ఐక్యజ్ఞానమును పొంది పరమాత్మనుఁ బొందకయే అధోగతిని (అన్ధంతమస్సును) పొందుటకు అర్హులైన తామస (ఆసుర) జనులకు ఈ సవాలుపత్రిక ప్రయోజనకరముగాదు. గనుక “ ఉత్తరాది మఠాధీశులగు సత్యధ్యానతీర్థులవారు బళ్లారిజిల్లా ఆదవాని మక్కాంలో 23—12—35 నాడు ప్రకటించిన ‘ వేదాన్తవిచార సవాలుపత్రిక’ యను తుక్కు కాగితమును.........జూచితిని ” అని శాస్త్రులవారు యోగ్యులకు మహాప్రయోజనకరమయిన సవాల్ పత్రికను తుక్కు కాగితమని వ్రాసినది యుక్తముగనున్నది.

" నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం నమన్త్రో నతీర్థం నవేదానయజ్ఞాః । (నిర్వాణషట్కము)..................నమే జాతిభేదః........ (ని. ష. గి) న మాతా పితావా న దేవా న లోకా న వేదా న యజ్ఞాః న తీర్థం బ్రువన్తి (దశశ్లోకీ 3) న వర్ణా న వర్ణా శ్రమాచారధర్మాః (౨) నశాస్తా నశాస్త్రం న శిష్యో న శిక్షా న చత్వం న చాహం న చాయం ప్రపఞ్చః (౭) న సాఙ్ఖ్యం న శైవం న తత్పాఞ్చరాత్రం న జైనం న మీమాంసకాదేర్మతంవా ॥ (౮) అను వాక్యములచే బ్రాహ్మణాది వర్ణములు, ఆశ్రమములు, మతములు, గురువులు, ధర్మములు, మతాభిమానము, శ్రేయస్సు మున్నగునవేమియు లేనని చెప్పు శఙ్కరాచార్యుల అనుయాయులైన ఈ శాస్త్రులయొక్క " చాతుర్వర్ణ్యముల వారందరును చక్కగా గమనించి ఆ వీరి సవాలు పత్రిక కేవల దురాగ్రహ కల్పితమనియు సర్వథా హేయమనియు నెరిగి, శ్రీ శఙ్కర మతాభిమానము గలిగి శ్రేయస్సును బడయుదురుగాక " అను వ్రాతను జూచిన ప్రాజ్ఞులకు " వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం దురాత్మనామ్ " అను శ్లోకమునందు చెప్పబడిన వీరి దురాత్మ స్వభావము త్రికరణశుద్ధికి దూరముగనున్నదని వ్యక్తము గాక పోదు.

వేదాంతవిచార సవాల్ పత్రికయందు 'బ్రహ్మసత్యం' అను వాక్యమునందుండు 'సత్యం' అను పదమునకు 'నిర్గుణుడు' అను నర్థమును నిర్వచింపలేదు. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః' అను శ్లోకముచేత శఙ్కరాచార్యులు చెప్పిన బ్రహ్మ నిర్గుణుడు అను నంశమునకు శ్రుతిసూత్రగీతారూపప్రమాణాధారములు లేవు. బ్రహ్మ కల్యాణగుణపరిపూర్ణుడనియే ప్రస్థానత్రయము చాటుచున్నది ' అని వ్రాయబడియున్నది. ఇటులుండ " బ్రహ్మసత్యం"—దీనికి బ్రహ్మ నిర్గుణము, అనగా సకలధర్మరహితము ' అని వీరు అర్థమును వ్రాసియున్నారు. పైపదములకట్టి యర్థమును ఏ యువ్యుత్పన్నుడైనను

చెప్పడు. మరేమన 'బ్రహ్మ సత్యమైనది' అను స్వరసమైన అర్థమునే ఏ మొద్దువాడైనను తప్పక పలుకును" అను వ్రాతను చూచినచో సవాల్ పత్రికయొక్క అర్థమే గాక శాంకరభాష్య గంధమే ఈశున శ్నైపుడగు ఈశాస్త్రికి సోకనట్లు తోచుచున్నది.

"అథకస్మాదుచ్యతే బ్రహ్మేతి బృంహతి బృంహయతి చేతి" అను శ్రుతిచేతనే బ్రహ్మయనిన బృహత్త్వాదిగుణ (ధర్మ) యుక్తమైన వస్తువు యనియే స్పష్టముగ తోచుచుండ బ్రహ్మ (బృహత్త్వాదిగుణ (ధర్మ) యుక్తమైన వస్తువు) నిర్గుణము బృహత్త్వాదిగుణ (ధర్మ రహితము, అనిఁజెప్పు అద్వైతులవలె ఏ మొద్దువాడుకూడ వ్యాహత భాషణమును జేయడు.

"నిర్విశేషత్వాన్మూఢాన్యచయాఢాన్యః" అను వాక్యముచే శంకరాచార్యులుఁజెప్పు నిర్గుణ (సకలధర్మరహితమగు) బ్రహ్మ సత్యము అను విషయమునే ఖండించెదము. "అథకస్మాదుచ్యతే బ్రహ్మేతి బృంహతి బృంహయతిచ" అను శ్రుత్యనుసారముగ బ్రహ్మశబ్దముచే బోధ్యుడైన పూర్ణత్వాదిగుణ (ధర్మ) యుక్తమైన బ్రహ్మ సత్యమని ఒప్పుకొని ఆ బ్రహ్మను ప్రమాణములచే స్థాపించెదమని వేదాంతవిచారణ సివిల్ కేసు పుస్తకమునందు మరియు వేదాంతవిచార సవాల్‌పత్రికయందును వ్రాసినది స్పష్టముగ అందరికిఁ కనబడుచున్నను నద్దానిని తెలిసికొనక, "బ్రహ్మ సత్యం" అను అంశమును వీరు ఖండింతురట. వీరిమతములో బ్రహ్మ సత్యము కాదు కాబోలు అను నీశాస్త్రియొక్క వ్రాతనుఁజూచినచో వీరు అత్యంతభ్రాన్తులనిఁజెప్పుటకు ఎంతయు చింతింపవలసి యున్నది. ఆహా! ఈశాస్త్రులవారిని "యద్దృశ్యం తన్మిథ్యా" (ఏదితోచునో అదంతయు అబద్ధమే మిథ్యయే) ఆపదార్థజ్ఞానముగూడ భ్రమమే) అనిజెప్పు నద్వైతమతము నవలంబించియుండుటఁ జేసియు,

విచారమునందు ప్రవృత్తులైనందునను «మిథ్యావాద విచారచిన్తనము హోకుర్వన్త్యద్వైతాత్మకాః భ్రాన్తా ఏవ నపారగాః" అని శఙ్కరాచార్యులు చెప్పియుండుటచేతను భ్రాన్తులని ఒప్పుకొనదగినదియై యున్నది. భ్రాన్తులు కాకయుండినచో «దృఢధియస్తూష్ణీంశిలావత్ స్థితాః" అని శఙ్కరాచార్యులు నుడివినరీతిగ రాతివలె ఊరకనుండియుందురు.

«అథకస్మాదుచ్యతే బ్రహ్మేతి బృంహతి బృంహయతిచ" అను శ్రుత్యర్థమునను సరించి «బృహత్త్వాది గుణ (ధర్మ) యుక్తుడైన నతడే బ్రహ్మశబ్దబోధ్యుడు, అట్టి బృహత్త్వాది గుణ (ధర్మ) యుక్తుడైన బ్రహ్మను సత్యమని ఒప్పుకొనక మిథ్యయనిచెప్పువారే నాస్తికులు. (బ్రహ్మలేదని చెప్పువారు) అట్టి బ్రహ్మను సత్యమని ఒప్పుకొనక మిథ్యయనిచెప్పు నరసరామశాస్త్రి మొదలైన నద్వైతులే హిందువులనిపించుకొని భారత భూమియందుండుటంజేసి «ఆహా! ఆస్తికమహాశయులారా! బ్రహ్మ సత్యముకాదని వాదించు హిందువు భారతభూమిలో నొక్కడైన నుండడు. అని వ్రాసిన శాస్త్రి మతిభ్రమణము ఎంతయని చెప్పవలెను? బృహత్త్వాది గుణోపేతుడనియు, బ్రహ్మశబ్దముచే బోధ్యుడైన బ్రహ్మలేడనియు జెప్పుకాము (అద్వైతులే, హిందువులేకామని తెలిసికొని యున్నారో, లేక వీరికి «తమ మతమున బ్రహ్మశబ్దబోధ్యుడైన బ్రహ్మలేడు. కల్ల (మిథ్యా) అని జెప్పుదురు"" అను జ్ఞానమే లేకున్నదో, అను దానిని ప్రాజ్ఞులే యూహింతురుగాక.

### 2-వ విషయము.

«ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః । మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః" అనునిది తమ శఙ్కరాచార్యుల పరమగురువులైన గౌడపాదాచార్యులచే విరచితమైన కారికగాని, శ్రుతి (ఉపనిషత్తు) గాదు. అని తామే (అద్వైతులే) ఒప్పుకొనినదానిని జగన్మిథ్యాత్వ విషయమునందు ఆధారమైన ఉపనిష

శ్రుతి వాక్యెవరనిన ఈశాస్త్రికి ఏది శ్రుతియూ, ఏది శ్రుతిగాదో అను జ్ఞానముగూడ లేనట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి జ్ఞానహైన్యమునందు మునకలిడువారు వేదాంతనవాలుపత్రికను ఎట్లు ఖండింతురో పాఠకులె యూహింతురుగాక.

ఈ వాక్యము అద్వైతులు వేదవాక్యముకాదని ఒప్పుకొని యున్నందున జగత్తుయొక్క మిథ్యాత్వవిషయమునందు శ్రుతి (ఉపనిషత్) రూప ఆధారముగ గాజాలదు.

‹ మాయామాత్రన్తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్ ' (3-2-3) అను నీసూత్రమును శఙ్కరాచార్యులే స్వప్నమిథ్యాత్వ విషయమునందు ఆధారమునుగ జెప్పియున్నారే గాని జగన్మిథ్యాత్వ విషయమునందు ఆధారముగఁజెప్పలేదు గనుక ఈ సూత్రము జగన్మిథ్యాత్వవిషయమునందు ఆధారమగుటలేదని ఈ శునశ్శేఫునకు తెలియదుఁ కాబోలు. ఈరీతిగ వేదజ్ఞానశూన్యుడై తమ శఙ్కరాచార్యుల భాష్యజ్ఞానముకూడ లేక శాంకరస్వాముల పీఠమునకు శిష్యుడని ఎద తట్టుచు ఇచ్చవచ్చినట్లు వ్రాయు ఈదుశ్శాస్త్రిని ఎవరు ఏమనవలెనో తెలియకున్నది.

‹ మాయామాత్రన్తు ' అను సూత్రము స్వప్నపదార్థమునకు మిథ్యాత్వమును సాధించు విషయమునందు ఆరు కారణములను చెప్పియున్నదని శంకరాచార్యులు చేసిన వ్యాఖ్యానముగూడ యుక్తము గాదు. అంతేగాక స్వవ్యాఘాతముగనున్నది అను విషయము సివిల్ కేసు 2వ ఇష్యూపుస్తకమున సవిస్తరముగ నిరూపింపబడి యున్నది. చూడుడు.

" అవ్యక్తాదీని.... .... .... .... .... " ఈ శ్లోకము ‹ భూతములు అవ్యక్తము (ప్రకృతి) వలన బుట్టును. మధ్యనకొంత కాలమున వ్యక్తములైయుండును. మరియు అవ్యక్తమునందే లయమును బొంది

మును' అని చెప్పుచున్నది. గాని జగత్తుమిథ్యయనిచెప్పుటలేదు. ఈశ్లోకమునందు జగత్తుకు మిథ్యాత్వమును బోధించు పదమేలేదు. ఈశాస్త్రికి 'మిథ్యాత్వమునుచెప్పు పదముగలదని భ్రమగలిగెనో, ఉన్నపదములకే మిథ్య యను అర్థముగలదని భ్రమగలిగెనో యను దానిని పండితులే యూహింతురుగాక. అద్వైతమతప్రకారముగ కనపడునదియంతయు భ్రమయేగదా! గనుక ఇదిమాత్రము భ్రమ కాక యుండునా!

« ఇదిగాక వీరి మతకర్తలగు మధ్వార్యులే బ్రహ్మసూత్ర భాష్యజిజ్ఞాసాధికరణమునందు «అబ్రహ్మస్తంబపర్యన్తమస్సారం చాప్య నిత్యకం। విజ్ఞాయ........" ఇత్యాది వాక్యములచే జగన్మిథ్యాత్వమునే స్పష్టముగాచెప్పియున్నారు. ఇట్లుండగా దీనిని వీరు ఖండింపబూనుట తమ ఆచార్యవచనవ్యాహతి దోషగ్రస్తమగుచున్నదని చదువరులే యూహింతురుగాక " అని వ్రాయు శబ్దజ్ఞానమేలేని ఈశాస్త్రికిని వీరిపాటకు ఇదేరీతిగ తాళముగొట్టు మాంతాచార్యులకును మిథ్యా శబ్దార్థమేమి? అనిత్యశబ్దార్థమేమి? యనునదియే తెలియలేదని గన్పట్టుచున్నది. మిథ్యయనిన మూడుకాలములయందు లేనిది. అనిత్యమనిన కొంతకాలమువరకు నుండి కొంతకాలములో లేకయుండునది. జగద్గురువులగు శ్రీమధ్వాచార్యులు బ్రహ్మాది (చతుర్ముఖాది) సమస్త ప్రాణులు, అనిత్యులు—(అనిత్యదేహములుగలవారు) అని తెలిసికొని విరక్తుడై విష్ణుపాదమునే ఆశ్రయించవలెనని చెప్పియున్నారేగాని మిథ్య (మూడుకాలములందు లేనిది) యని చెప్పలేదు.

మరియు 'నేనే ఈశ్వరుడను జగత్తుమిథ్య' (అసత్) అని బౌద్ధునివలె చెప్పు నద్వైతులను « అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం,' 'ఈశ్వరోఽహం........" అను గీతాప్రమాణానుసారముగ అసురులని చెప్పు శ్రీమధ్వాచార్యులు « జగత్తు అసత్యమనియు, ఇపుడే

బ్రహ్మ, (జీవునకు బ్రహ్మతో నైక్యము) యనియు చెప్పెదరు " అని అభాసజ్ఞానియగు ఈశాస్త్రికి భ్రమము గలుగుటకు వారి గ్రంథము లను చూడకయుండుటయు, ఒకవేళ చూచియున్నను అర్థముకాక యుండుటయు కారణమని యూహింపనగును.

3 వ విషయము.

'జ్ఞానీత్వాత్మైవ మేమతం' అను శ్లోకము జ్ఞానియైన జీవునకును పరమాత్మయైన శ్రీకృష్ణునకును అభేదమునుఁజెప్పదు. ఎందుకనగా—

1 అద్వైతమతప్రకారముగ విశిష్టుడును మిథ్యాభూతుడైన కృష్ణునకును మిథ్యా భూతుడగు జ్ఞానికిని ఐక్యము కుదరకపోవుట చేతను,

2 'ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ' అను శ్లోకము నందుఁజెప్పబడిన ఆర్తుడు మున్నగు నలుగురున్ను అద్వైతమత ప్రకారముగ బ్రహ్మస్వరూపము గలవారగుటవలన జ్ఞానియొక్కడే బ్రహ్మస్వరూపుడని చెప్పుట అయుక్తమగుచున్నందునను,

3 గీతయందే 'ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదా హృతః' 'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' ఇత్యాది శ్లోకములచే జీవపరమాత్మలకు భేదము చక్కగా చెప్పబడియుండుట చేతను,

4 'ఈశ్వరోఽహం' ఇత్యాది శ్లోకములయందు 'నేనే బ్రహ్మ' యను జ్ఞానము గలవారు పరమాత్మనుపొందక అధోగతిని (అధ్యంతమస్సును) పొందెదరని నిందించుచు ఈశ్వరాభేదమును నిరాక రించుచున్నందునను,

5 పరమాత్మయందుంచబడిన మనస్సుగల జ్ఞాని అనుత్తమగతి రూపుడైన నన్ను పొందుటకు ప్రవృత్తుడైనవాడు. (జ్ఞాని పరమాత్మ ను పొంద యత్నించువాడు) అని ఈశ్లోకముయొక్క 'ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్' అను ఉత్తరా[illegible]

చెప్పబడియున్నందునను,

6 ‹ బహూనాం జన్మనామ న్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే, అను ఉత్తరశ్లోకమునందు జ్ఞాని నన్ను పొందుచున్నాడని ప్రాప్యప్రాపకభావ మును చెప్పియుండుటచేతను,

7 ‹ యచ్చాప్నోతి యదాదత్తే' అని శంకరాచార్యులచేతనే ఉదాహరింపబడిన భారతశ్లోకమునందు ‹ ఆప్నోతీతి ఆత్మా' (పొందు వాడు) అని ఆత్మశబ్దము నిర్వచింపబడియుండుటచేత ‹ జ్ఞానీత్వాత్మైవ ' జ్ఞాని నన్ను పొందదగినవాడే, యనునర్థమే యుక్తమైనదేగాని ‹జ్ఞాని యే ఆత్మ' యను నర్థము యుక్తమయినదిగాదు. గనుక ఈశ్లోకము జ్ఞానికిని ఆత్మకును ఐక్యము గలదని జెప్పదు.

‹ క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి ' అను శ్లోకము జీవబ్రహ్మలకు అభేదమునుఁజెప్పదు.

‹ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ' అను శ్లోకము నందు చెప్పిన శరీరమను క్షేత్రమునే « తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి.................తత్సమాసేనమేశృణు " అను శ్లోకముచేత ఆక్షేత్రమేది? ఎట్టిది? దానివికారములేవి? అను విషయమును చెప్పెద వినుము. అని చెప్పి—, « మహాభూతాన్యహఙ్కారో బుద్ధి రవ్యక్తమేవచ । ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చచేన్ద్రియగోచరాః ॥ ఇచ్ఛా ద్వేషస్సుఖందుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః । ఏతత్ క్షేత్రం సమా సేన సవికారముదాహృతమ్ ॥ అను శ్లోకములచే పఞ్చమహాభూతాది సమస్తప్రపఞ్చము శరీరమనబడు క్షేత్రమని చెప్పియుండుటవలన ఈ అగుపడు కరచరణాదులతో యుక్తమైన ఏడడుగులుగల దేహము క్షేత్రము గాదు. అట్టి పంచమహాభూతాది సమస్తజగద్రూపమైన క్షేత్రమును జీవుడు తెలిసికొనజాలడు. (ఏడడుగులుగల) తన దేహ మునే తెలిసికొనక డాక్టరు ఇంటికి తిరుగుచుండు జీవుడు ఈ సమస్త

ప్రపంచమును ఎట్లు తెలిసికొనును? అందుచే ఈ సమస్తజగదాత్మక క్షేత్రమును తెలిసికొనిన పరబ్రహ్మయే క్షేత్రజ్ఞుడు.

మరియు «జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృతమశ్నుతే అను వాక్యముచే జ్ఞేయుడైన క్షేత్రజ్ఞునిఁజెప్పెదనని ప్రతిజ్ఞచేసి «అనాదిమత్పరం బ్రహ్మ' (గీ ౧౩-౧౨) «క్షేత్రజ్ఞుడు పరబ్రహ్మయే' యని శ్రీకృష్ణుడేఁజెప్పియున్నాడు. శఙ్కరాచార్యులు ఈ శ్లోకమునకు «క్షేత్రజ్ఞుడు పరబ్రహ్మ యని శ్రీకృష్ణుడే చెప్పియున్నాడు' అని వ్యాఖ్యానమునుఁజేసియున్నారు అనిన తరువాత «క్షేత్రాత్మకమైన శరీరమే సమస్తజగత్తు, ఈ సమస్తజగదాత్మకమైన క్షేత్రమును తెలిసిన నతడు పరబ్రహ్మ' అని గీతాశ్లోకములచేతను, శఙ్కరాచార్యుల వ్యాఖ్యానముచేతను సిద్ధించుచున్నందున, 'క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి' అను శ్లోకము «క్షేత్రజ్ఞుడైన పరబ్రహ్మ నేనే అని తెలిసికొనుము' అను నర్థమును బోధించుచున్నది.

మఱియు ఈ అర్థము «పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ .... .... ....ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా। అసితో దేవలో వ్యాసస్స్వయంచైవ బ్రవీషి మే। సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ। (గీ. ౧౦-౧౨, ౧౩) ఇత్యాది శ్లోకములచే «పరబ్రహ్మమే శ్రీకృష్ణుడని నారదమహర్షి మున్నగువారుఁజెప్పుచున్నారు. నీవు (శ్రీకృష్ణుడు) గూడఁజెప్పుచున్నావు. వీటినన్నిటిని సత్యమనియే తెలుసికొనుచున్నాను' అని చెప్పియుండుటంబట్టి «శ్రీకృష్ణుడే పరబ్రహ్మ' యని ఈ శ్లోకమునకు నర్థమును నిస్సంశయముగ జెప్పుట యుక్తమగుచున్నందున ఈ శ్లోకము క్షేత్రజ్ఞుడైన పరబ్రహ్మయే శ్రీకృష్ణుడని చెప్పుచున్నదేగాని జీవుడు శ్రీకృష్ణుడని చెప్పుటలేదు.

మరియు అద్వైతమతప్రకారముగ శ్రీకృష్ణుడు సగుణుడు, మాయికుడు, మిథ్యాభూతుడు, విశిష్టుడు అయినందున అట్టి విశిష్టుని

మిథ్యాభూతుడునైన శ్రీకృష్ణునకును, మిథ్యాభూతుడును అల్పజ్ఞత్వా దిగుణ విశిష్టుడైన జీవునకును ఐక్యము కుదరకున్నందున ఈ వాక్యము జీవునకు కృష్ణునితో ఐక్యమును బోధించదు.

'మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే' అను వాక్యము జీవబ్రహ్మలకు ఐక్యమును చెప్పదు. ఎందుకనగా—

అద్వైతమతప్రకారముగ జీవునకు బ్రహ్మభావము (బ్రహ్మత్వము) ఎల్లప్పుడు నుండునదియే. అపూర్వముగ గలుగదు గదా. అందువలనను, విశిష్టుడైన జీవునకు విశిష్టుడైన కృష్ణునితో ఐక్యము కుదరకపోవుటచేతను, 'ఏతత్ విజ్ఞాయ – ఈ బ్రహ్మను తెలిసికొని బ్రహ్మత్వమును పొందును అనుట అద్వైతమతప్రకారముగ కుదరక యుండుటచేతను, 'ఉత్తమః పురుష స్త్వన్యః', 'ఈశ్వరస్సర్వభూతానాం' మున్నగు అనేక గీతావాక్యములయందు జీవేశ్వరులకు భేదము చెప్పబడియుండుటవలనను, 'ఈశ్వరోఽహం' అను శ్లోకమునందు జీవేశ్వరాభేదము నిరాకరింపబడియుండుటచేతను, 'మద్భావా మానసా జాతాః (గీ-౧౦-౬) అను శ్లోకముయొక్క వ్యాఖ్యానావసరమునందు శంకరాచార్యులే 'మద్భావాః' అను పదమునకు 'మద్గతభావనాః, ('మయి సర్వజ్ఞే సర్వేశ్వరే గతా భావనా యేషాం తే తథా') (ఆనంద గిరీయం) సర్వజ్ఞుడైన మరియు సర్వేశ్వరుడైన నాయందు (శ్రీకృష్ణునియందు) ధ్యానముగలవారు' అను అర్థమునుజెప్పియుండుటచేతను. 'మద్భక్త ఏతద్విజ్ఞాయమద్భావాయోపపద్యతే" అను శ్లోకమునకు మద్భక్తః – నాభక్తుడు, నన్ను (శ్రీకృష్ణుని) తెలిసికొని మద్భావాయ నాధ్యానముచేయుటకు సమర్థుడగుచున్నాడు. అను అర్థమునే స్వీకరించవలసినందున ఈశ్లోకము జీవబ్రహ్మల ఐక్యవిషయమునందు ఆధారముగాజాలదని ఇంచుక జ్ఞానముగలవాడుగూడ నూహింపకపోడు. 'శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్'అనుసూత్రము జీవబ్రహ్మలకు

ఐక్యమును చెప్పుటలేదు. ఎందుకనగా—

'అహం మనురభవం సూర్యశ్చ' అను వాక్యమునకు అనన్తరమునందు ఋగ్వేదవాక్యములయందు 'నేను గర్భమునందు ఉండునపుడే దేవతలు పరమాత్మచే సృజింపబడిరని తెలిసికొనియున్నాను. సర్వప్రేరకుడైన పరమాత్మ గర్భమునందుండు నాశతృవులను సంహరించెను. పరిపూర్ణుడైన పరమాత్మ గర్భమునకు క్లేశకరమయిన వాయువును దాటించెనని వామదేవుడు చెప్పెనని చెప్పబడియున్నది. విద్యారణ్యులుగూడ ఇట్లే వ్యాఖ్యానముచేసియున్నారు. గనుక వామదేవునకు భేదజ్ఞానము కలదని తెలియబడుచున్నందున వామదేవునకు 'నేను బ్రహ్మ' యను నైక్యజ్ఞానము ఉండలేదని సిద్ధించుచున్నది. మరియు జ్ఞానియగు వామదేవునకు ఐక్యజ్ఞానముండినచో 'అహం భూమిమదదామార్యాయ' (నేను ఆర్యులకొరకు భూమినిచ్చితిని) ఇత్యాది భేదజ్ఞానకార్యమెట్లు పొందును?

మరియు అద్వైతమతప్రకారముగ విశిష్టులైన మన్వాదులతో విశిష్టుడైన వామదేవునకు ఐక్యము కుదరదు. లక్షణచే మన్వాదిపదములకు శుద్ధచిత్తును స్వీకరించి చిత్తు చిత్తునకు ఐక్యమునుజెప్పుచున్నదనినచో 'తత్త్వమసి' వాక్యమునందుఁజెప్పిన అనేక దోషములు సంభవించుచున్నవి. గనుక 'వామదేవవత్' అను దృష్టాన్తవాక్యమునకు వామదేవుడెట్లు ఐక్యదృష్టిచే 'నేను మనువు, నేను సూర్యుడు అని తెలిసికొనెను, అను అర్థము కుదరనందున ఈ దృష్టాన్తబలమువలన ఐక్యదృష్టిచే ఇన్ద్రుడు నేనే ప్రాణుడు (పరమాత్మ) అని తెలిసికొనెను, అను నర్థమును జెప్పుటయు అయుక్తమగుచున్నది.

మరియు 'ప్రాణస్తథానుగమాత్' అను ముఖ్యముయిన ప్రథమసూత్రమునందు ప్రాణశబ్దబోధ్యుడు పరమాత్మయే గాని ఇన్ద్రుడు కాడని స్పష్టముగ భేదము చెప్పబడియుండుటచేతను, 'జీవముఖ్య

ప్రాణలింగాత్ .... ....' అను ఉపసంహారమాత్రమునందు భేదము చెప్పబడియున్నందునను, ముఖ్యమైన ప్రథమమైన (ఉపక్రమమునందు చెప్పియుండు) సూత్రమునందు చెప్పియుండు అర్థమునకును, ఉపసంహారమునందుంటు 'జీవముఖ్యప్రాణలింగాత్, అను సూత్రమునకు చెప్పిన అర్థమునకును అనుగుణమైన అర్థమునే మధ్యననుండు 'శాస్త్ర దృష్ట్యా' అను గుణసూత్రమునకు (ప్రథమసూత్రార్థమును సాధించుటకై ప్రవృత్తమైన సూత్రమునకు) జెప్పవలెను. తద్విరుద్ధముగ అభేదమును చెప్పుచున్నదనుట అత్యంతము అయుక్తముగనున్నది.

మరియు 'నేనే బ్రహ్మ' యని జెప్పు శాస్త్రములే (వేదాదులే) లేనందున 'శాస్త్రదృష్ట్యా' అను పదమునకు శాస్త్రానుసారియైన 'అహంబ్రహ్మ' (నేనే బ్రహ్మ) యను దృష్టిచే అను నర్థము అయుక్తమగుచున్నందున 'యః పృథివ్యాంతిష్ఠన్' 'య ఆత్మని తిష్ఠన్' 'యస్సర్వేషు భూతేషు తిష్ఠన్' ఇత్యాది వేదవాక్యములు 'శారీరశ్చోభయేఽపిహి భేదేనైనమధీయతే,' 'భేదవ్యపదేశాచ్చాన్యః' ఇత్యాది సూత్రములు 'పరమాత్మ ఇన్ద్రుడు వాయువు మున్నగు సమస్తచేతనులయందు అన్తర్యామియై యున్నాడని చెప్పుచున్నవి. మరియు శఙ్కరాచార్యులుగూడ ఈవాక్యములు అట్లే చెప్పుచున్నవని ఒప్పుకొనియున్నందునను 'శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్' అను సూత్రమునకు 'వామదేవుడు, 'పరమాత్మ అందరికి (ఈరాత్మ — ప్రేరకః)(విద్యారణ్యభాష్యము.) ప్రేరకుడు. (అన్తర్యామి) అనుదృష్టిచే 'అహంమనుః' అని ఎట్లు చెప్పియున్నాడో అట్లే 'యస్సర్వేషు భూతేషు తిష్ఠన్' 'య ఆత్మని. తిష్ఠన్' ఇవే మొదలైన శాస్త్రములచే సిద్ధించు "పరమాత్మ నాయొక్క (ఇన్ద్రునియొక్క) అన్తర్యామి" అను దృష్టిచే 'నేనే ప్రాణుడు' (ప్రాణనామకపరమాత్మ నా అంతర్యామి.) అను నర్థమే యుక్తమైనది.

« సేయం దేవతైక్షత హన్తాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేన ఆత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి” అను వాక్యముచే జీవపరమాత్మలకు అభేదము సిద్ధించదు. ఎందుకనగా—

‘కరణమాత్రాశఙ్కానివృత్తయే’ ఇత్యాది వాక్యములచే దేవతాశబ్దము చేతనవాచకమని శంకరాచార్యులచె చెప్పబడి యుండుట చేతను, « త్రయోవింశతితత్త్వానాంగణం యుగపదావిశత్ । సోఽను ప్రవిష్టో భగవాన్ చేష్టారూపేణ తంగణమ్ । భిన్నం సంయోజయామాస సుప్తం కర్మ ప్రబోధయన్ ॥” ఇవే మొదలగు ప్రమాణములచే ‘పరమాత్మ చేష్టకరూపముచే (జీవరూపముచే) పృథివ్యాది తత్త్వాభిమానిదేవతలయందు ప్రవేశించి పదార్థములను సృజించెనని చెప్పబడియుండుటచేతను, యః పృథివ్యాం తిష్ఠన్’ ఇత్యాదివాక్యముల యందు పృథివ్యాదిశబ్దములు పృథివ్యాద్యభిమానిదేవతలను తెలుపునవనియు, పృథివ్యాద్యభిమానిదేవతలయందు నారాయణుడు నియామకుడై యున్నాడనియు శఙ్కరాచార్యులు చెప్పియుండుటచేతను, ‘జీవఇత్యనిరుద్ధస్యాఖ్యా’ అను ప్రమాణానుసారముగ జీవశబ్దము అనిరుద్ధనామకపరమాత్మను చెప్పుచున్నందునను, ‘జీవో జీవమజీజనత్’ అను ప్రమాణము జీవనామక అనిరుద్ధరూపియైన పరమాత్మ జీవులను సృజించెను అని చెప్పుచుండుటచేతను, « యో వాసుదేవో భగవాన్ క్షేత్రజ్ఞో నిర్గుణాత్మకః । జ్ఞేయస్స ఏవ రాజేన్ద్ర జీవస్సఙ్కర్షణః ప్రభుః ”। (మహాభా. శాంతి.-33౯-౪౦) « అహంహి జీవసంజ్ఞో వై ” (మహాభా. శాం.-33౭-౪౨) అను వాక్యములు జీవశబ్దము పరమాత్మపరమని చెప్పియుండుటచేతను, దేవతాశబ్దముతోను జీవశబ్దముతోను గూడియుండు ‘ఇమాస్తిస్రో దేవతా అను ప్రవిశ్య’ అను వాక్యము ‘పరమాత్మ తేజోజలపృథివ్యాద్యభిమానిదేవతలయందు (చేతనుల

యందు) పృథివ్యాదిపదార్థ వ్యాపారప్రవర్తకమయిన జీవుడను పేరుగల అనిరుద్ధరూపముచే ప్రవేశించి వాటిని ప్రేరేపించి సృజించుచున్నాడని చెప్పుచున్నందునను ప్రవేశించు పరమాత్మకు ప్రవేశ్యమైన పృథివ్యాద్యభిమాని దేవతలతో (చేతనులతో) భేదమును చెప్పుచున్నదేగాని పృథివ్యాదిసమస్తపదార్థములందు కనబడు జీవుడు పరమాత్మయే యని చెప్పుట లేదు.

ప్రవేశమును చెప్పుటయందు శ్రుతికి తాత్పర్యము లేదని అద్వైతులు ఒప్పుకొనియుండుటచేత ఈ వాక్యము 'పరమాత్మయే జీవరూపముచే ప్రవేశించి యున్నాడు, జీవపరమాత్మలిద్దరు ఒకరే యని చెప్పదు.

'స యశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే స ఏకః' అను వాక్యము జీవపరమాత్మలకు ఐక్యమును చెప్పదు. ఎందుకనగా—

'య ఆదిత్యే తిష్ఠన్' 'య ఆత్మని తిష్ఠన్' ఇత్యాది వేదవాక్యములు ఆదిత్యాన్తర్గతపరమాత్మకును ఆదిత్యునకును, జీవాన్తర్గతపరమాత్మకును జీవునకును భేదమును చెప్పుచున్నవి. 'అన్తర్యామ్యధిదేవాదిషు తద్ధర్మవ్యపదేశాత్' 'శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే' 'భేదవ్యపదేశాచ్చాన్యః' ఇత్యాదిసూత్రములు భేదమును చెప్పుచున్నవని శఙ్కరాచార్యులు చెప్పియుండుటంబట్టి 'సయశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే స ఏకః' అను వాక్యము ఆధారాధేయభావముచే ఆదిత్యాన్తర్గతపరమాత్మకును ఆదిత్యునకును, జీవాన్తర్గతపరమాత్మకును జీవునకును భేదమును చెప్పుచు ఉభయాన్తర్గతుడైన పరమాత్మకు ఐక్యమును (స్వగతభేదరాహిత్యమును) తెలుపుచున్నదే గాని జీవపరమాత్మలకు ఐక్యమును చెప్పదు.

'స ఆత్మా తత్త్వమసి' అను వాక్యము జీవపరమాత్మలకు ఐక్యమును చెప్పదు. ఎట్లనిన—,

'స ఆత్మా తత్త్వమసి' అను శ్రుతియందు 'సః ఆత్మా, అతత్, త్వం, అసి,' యనియు, సః, ఆత్మా తత్, త్వం, అసి, అనియు పదవి భాగమును చేయుటకు వచ్చుచున్నందున 'అతత్' అని పదవిభాగ మును జేసినచో ఈ శ్రుతి 'ఓ శ్వేతకేతూ! త్వం — నీవు, అతత్ — ఆ నన్నామకుడైన పరమాత్మకంటె భిన్నుడై, అసి — ఉంటున్నావు' అను అర్థమును తెలియపరచుచు జీవపరమాత్మల భేదమునే తెలుపుచున్నది.

'తత్' అని పదవిభాగమును చేసినను "సంసర్గాసఙ్గి సమ్యగ్ధీ హేతుతాయా" ఇత్యాది అద్వైతులవాక్యములచే "ఈ వాక్యము 'తత్, త్వం, అసి, అను పదములచే చిత్ అను బోధను మాత్రము గలుగజేయుచున్నది కాని అభేదమును బోధించదు." అని అద్వై తులే ఒప్పుకొనియుండుటచే వారిమతప్రకారముగనే ఈ వాక్యము అభేదవిషయమునందు ఆధారముకాజాలదు. మరియు సర్వేశత్వ స్వత న్త్రత్వ సర్వజ్ఞత్వ సర్వోత్తమత్వ సత్యకామత్వ సత్యసఙ్కల్ప త్వేశ్వ రత్వాది గుణములతోఁగూడిన పరమాత్మ 'తత్' పదముచే బోధితు డగుచున్నాడు. అల్పజ్ఞత్వదుఃఖిత్వాదిగుణములతో గూడిన జీవుడు 'త్వం' పదముచే బోధితుడగుచున్నాడు. విరుద్ధధర్మములుగల తేజోజలములు, పరమాణుమేరుపర్వతములు - మున్నగువాట్లకు ఐక్య మెట్లు కుదరదో అట్లే సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వాది విరుద్ధధర్మములుగల జీవ పరమాత్మలకు ఐక్యము కుదరజాలదని శఙ్కరాచార్యులే 'తత్త్వమసి' అను వాక్యమునకు ముఖ్యవృత్తిచే (By the primery meaning) ఐక్యము కుదరదని చెప్పియుండుటవలన అద్వైతమతప్రకారముగ ముఖ్యార్థము కుదరకున్నందున 'తత్' అను పదము 'సుపాంసులుక్' అను సూత్రానుసారముగ సప్తవిభక్త్యన్తముగ నుండుటచే "సన్మూ లాస్సోమ్య సర్వాః ప్రజాస్సదాయతనాః" ఇత్యాది పూర్వోత్తరవాక్య

ములను, ఇతరవేదాంతవాక్యములను అనుసరించి ఓ శ్వేతకేతూ! త్వం — నీవు, తత్ — ఆపరమాత్మకు అధీనుడై, అసి — ఉన్నావు అనియు లేక పరమాత్మను ఆశ్రయించినవాడై యున్నావు అనియు, అథవా పరమాత్మవలన జనించినవాడై యున్నావనియు మున్నగు అనేకార్థములను చెప్పుచు జీవపరమాత్మల భేదమునే తెలుపుచున్నం దున ఈ 'స ఆత్మా తత్త్వమసి' అను వాక్యము జీవపరమాత్మల భేద విషయమునందే ప్రమాణమగుచున్నది. ఈవిషయమై ఎక్కువ విచా రము శ్రీస్వాములవారి వేదాంతవిచారణ సివిల్‌సూటు 3వ ఇష్యూ వందు చక్కగా చేయబడి యున్నది. చూడుడు.

"తదాహుర్యద్బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యన్తో మనుష్యా మన్యన్తే కిముతద్బ్రహ్మావేత్ యస్మాత్తత్సర్వమభవత్ ఇతి బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్ తదాత్మానమేవావేత్ అహం బ్రహ్మాస్మీతి" (బృ. 1-4-9, 10.) అను వాక్యము జీవబ్రహ్మలకు ఐక్యమును జెప్పదు.

'తత్కిమవేత్ యస్మాత్తత్సర్వమభవత్' అను పూర్వవాక్యము వందు 'బ్రహ్మపూర్ణుడైయున్నాడు అతనికి బ్రహ్మజ్ఞానము గలదా? అను ప్రశ్నకు ఉత్తరరూపముగ 'బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్ ........ అహం బ్రహ్మాస్మి' అను వాక్యము ప్రవృత్తమయినది. ఈవాక్యము నందు జీవుని ప్రసక్తియే లేనందున నిది జీవునిచే చెప్పబడిన వాక్య మని జెప్పుటకు వీలులేదు. బ్రహ్మయొక్క వాక్యమనియేచెప్ప వలెను గనుక రాజు నేను 'రాజై యున్నా'నని నచో ఎట్లు ప్రజలు రాజులు గాజాలరో అట్లే పరమాత్మ (పరబ్రహ్మ) నేను బ్రహ్మమై యున్నానని తెలిసికొనెనని చెప్పినమాత్రమున జీవుడు బ్రహ్మయని సిద్ధించదు.

'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమునకు 'జీవుడు నేను

బ్రహ్మమైయున్నానని తెలిసికొనెను' అను నర్థమును జెప్పినచో దేవతలు మున్నగు జీవులందరును తమ్ము బ్రహ్మయని తెలిసికొని సర్వభావమును (పరిపూర్ణత్వమును) పొందిరని సిద్ధించుటచే తరువాత దేవతలు ఋషులు మనుష్యులు తెలిసికొనిరని చెప్పు 'యో యో దేవా నాం' ఇత్యాది వాక్యములు వ్యర్థములగును. అందువలన 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమునకు 'జీవుడు నేనే బ్రహ్మమైయున్నానని తెలిసికొనెను' అను అర్థమునుజెప్పుట కుదరదు.

ఈ వాక్యమునకు పైనుండు 'యో యో దేవానాం' అను వాక్యము దేవతలు, ఋషులు, మనుష్యులు వీర్లకును బ్రహ్మకును భేదమును తెలుపుచున్నది. మరియు దేవానాం, ఋషీణాం, మనుష్యా ణాం' అను బహువచనపదములచే దేవతలలోను, ఋషులలోను, మనుష్యులలోను పరస్పరము భేదము గలదని తెలియపరచుచున్నది. గనుక ఈ వాక్యము భేదవిషయమునందే ఆధారమగుచున్నది. శంకరాచార్యులుకూడ 'యో యో దేవానాం' అను వాక్యము భేద మునే చెప్పుచున్నదని ఒప్పుకొని మతాభినివేశమువలన ఆ భేదము మిథ్యయని తెలిసికొనవలెను అని చెప్పియున్నారు. వారేమయినను చెప్పని, వేదములన్ననో భేదమునే చెప్పుచున్నవి. అను విషయము నిర్వివాదముగ నున్నది. గనుక ఈ వేదవాక్యముకూడ జీవబ్రహ్మలకు భేదమునే చెప్పుచున్నదిగాని అభేదమునుచెప్పదు.

'త్వం పశుః (నీవు పశువు) అగ్నిర్మాణవకః (ఈ బాలకుడు అగ్నియే) అని చెప్పినచో మనుష్యపశువులకు మాణవకాగ్నులకు ఐక్యము తోచుచున్నను ఎట్లు ఐక్యము కుదరకపోవుటచే మనుష్యుడు పశుతుల్యుడు (పశువువలెవివేకశూన్యుడు) మాణవకుడు అగ్నివదృ శుడు (అగ్నివలె పరిశుద్ధుడు) అని అర్థమగుచున్నదో అటులనే 'తత్త్వ

మసి,' 'అహంబ్రహ్మాస్మి' అను వాక్యములకు 'నీవు బ్రహ్మ, నేను బ్రహ్మ, అను అర్థము తోచుచున్నను, 'సర్వేశత్వ స్వత న్త్రత్వ సర్వజ్ఞత్వాదిభిర్గుణైః। సర్వోత్తమస్సత్యకామస్సత్యసంకల్ప ఈశ్వరః। తత్ప దార్థ స్త్వమర్థస్తుకించిద్ జ్ఞో దుఃఖజీవనః। సంసార్యయం తద్గతికో జీవః ప్రాకృతలక్షణః। కథమేకత్వమనయోర్ఘటతే విపరీతయోః" అని శంకరాచార్యులు చెప్పినరీతిగ సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వాది విరుద్ధధర్మములుగల జీవ బ్రహ్మలకు ఐక్యము కుదరకయుండుటవలన 'నీవు బ్రహ్మవలె జ్ఞానానన్దాదిగుణములు గలవాడవై యున్నావుకాని బ్రహ్మయే అయి యుండలేదు. నేను బ్రహ్మవలె జ్ఞానానన్దాదిగుణములు గలవాడనై యున్నానే గాని బ్రహ్మయే అయి యుండుటలేదు' అని అర్థముండుటంబట్టి జీవబ్రహ్మల ఐక్యవిషయమున శ్రుతికి తాత్పర్యములేదని" భిన్నా జీవాః పరో భిన్న స్తథాపి జ్ఞానరూపతః। ప్రోచ్యన్తే బ్రహ్మరూపేణ వేదవాదేషు సర్వశః॥ అను ప్రమాణవాక్యము నుదహరించి "తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః" (౨-౩-౨౯)అనుసూత్రమునందు శ్రీమజ్జగద్గురు మధ్వాచార్యులవారు స్పష్టముగ జీవబ్రహ్మభేదమును వివరించియుండగ వారు 'తత్త్వమసి' ఇత్యాదివాక్యములకు అభేదమునందు తాత్పర్యము గలదని చెప్పియున్నారు అని శ్రీమధ్వాచార్యులవారి భాష్యమునకు అర్థమును ఏలాటిమూఢుడును జేయబూనడు. గనుక " ఇదిగాక వీరి మధ్వరాయలే తమ సూత్రభాష్యద్వితీయాధ్యాయములో ప్రథమ పాదమున పృథగధికరణ (తద్గుణసారత్వాధికరణ) మునందు " జ్ఞానానన్దాదిబ్రహ్మగుణా ఏవ అస్య యతః సారః స్వరూపం, అతః అభేద వ్యపదేశః" అని తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి' ఇత్యాదిశ్రుతులకు అభేదమే తాత్పర్యమని స్పష్టముగ చెప్పియున్నారు. గనుక అభేదము ద్వైతాచార్యులనబడు మధ్వరాయలకును అభిమతమేయని సిద్ధమగు చుండగా దీనిని వీరు ఖండింపబూనుట యెట్టిదో చదువరులే యూ-

హింతురుగాక." అని వ్రాయుట అత్యంతమయుక్తముగుచు వీరి జ్ఞాన శూన్యత్వమును వెల్లడిచేయుచున్నది.

ఇంతేగాక ద్వితీయాధ్యాయతృతీయపాదమునందు నీసూత్రమును ప్రథమపాదములో నున్నటుల వ్రాయు పండితంమన్యుడు తుదకీ వాక్యమెచ్చట నున్నదో యనిగూడ గమనింప లేదని స్పష్టమగుచున్నది.

ఈ ప్రకారముగ ౧ 'బ్రహ్మసత్యం, ౨ జగన్మిథ్యా, ౩ జీవో బ్రహ్మైవ నాపరః' అను నద్వైతమత తత్వములు అవైదికములగుటం జేసి, అద్వైతమతమవైదికమే. మరియు ఆమతతత్వములు బౌద్ధమతతత్వములే యగుటంబట్టి బౌద్ధమతమే.

"వీరి వేదాన్తవిచారణ సివిల్ కేసు అను గ్రన్థము సర్వవిధములుగా అసంగతమైనదని దేశమందంతటను నానావిధముల ఖండింపబడియుండుట సర్వవిదితము. అట్లుండియు వీరు తమ వాదము నిలువబెట్టుకొనుటకై తగిన ప్రతిఖండన గ్రన్థములను శాస్త్రీయపద్ధతితో రచింపక ఇట్టి కేవల శుష్కప్రతిజ్ఞలను ప్రకటించుటలో గల లాభమును చేదువరులే యూహింతురుగాక'' అని వ్రాసియున్నారు.

అద్వైతమతమునందుఁ జెప్పియుండు 'బ్రహ్మసత్యం, జగన్మిథ్యా, జీవోబ్రహ్మైవ నాపరః' అను నీమూడువిషయములందు నొక ప్రమాణమునైననుఁ జూపక అసంబద్ధముగ ఏదేదో ప్రలపించినచో 'నహిరుతమనురాతి గ్రామసింహస్యసింహః' అను న్యాయము ననుసరించి ఇట్టి మొరగునకును ఉత్తరమువిచ్చేవారెవరు? ఈ పై మూడు విషయములం[illegible] శ్రుతిసూత్ర గీతారూపగ్రన్థములయందు ఏదైన ప్రమాణమునిచ్చి ఈ మూడు విషయములను సాధింపబూనినచో నద్దానిని ఖండింప సంసిద్ధులై యున్నాము.

ఇప్పటికి వేదాన్తవిచారణ సివిల్ కేసు అను పుస్తకమునందు వ్రాయబడియుండు ఏవిషయమునకును ఖండన మొనరింపబడక యుండు టంబట్టి ఈ "అసత్యధ్వాన్తభాస్కరము" మున్నగు పుస్తకములకు ఉత్తరము నియ్యలేదు. ఇవ్వనావశ్యకమును లేదు. 'నిర్గుణబ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య' జీవబ్రహ్మలకు ఐక్యము గలదని శ్రుతిసూత్ర గీతారూప ప్రమాణములతో పండితులెవరైనను సమక్షమున వాదరూప ముగనో గ్రన్థరూపముగనో సిద్ధపరచినచో నయ్యది విచారింపబడును.

"ఇక వీరు కడపట కొన్ని వాదనియమములను సూచించి యున్నారు. ఉభయులు వాదమునకు గడంగినపిమ్మట పరస్పరసమ్మతితో నిర్ణయింప తగినట్టి ఈ నియమములను తామే మొట్టమొదటనే స్వానుకూలముగా టిక్కెట్లు మున్నగువాటితో కూడ సిద్ధముగా సూచించుటలో నిజముగా వీరికి ఈ వాదము జేయగవలెనని యుద్దేశమా లేక ఏదో రొంకతీయన పామరలోకమును మోసపుచ్చి ప్రఖ్యాతికొరకై యార్భాటము చేయవలెనని యుద్దేశమా యనుదానిని చేదువరులే యూహింతురుగాక" అని వ్రాయబడియున్నది.

పండితులైన యద్వైతులే మేము చేసియుండు నియమములకు వ్యతిరిక్తములగు యోగ్యమైన వాదనియమములను స్థలమును వాదముచేయు పండితుల పేర్లను వ్యవస్థజేసి ఐదుగురి గొప్పమనుష్యుల చేవ్రాల సహితముగ ప్రసిద్ధపరచినచో ఆనియమముల ప్రకారము ద్వైతులు వాదింప సంసిద్ధులై యున్నారు. శాస్త్రజ్ఞాన శూన్యులైన రాశిభట్టు గామభట్టు పంచాంగం భాస్కరప్పలు మున్నగు అవ్యవస్థితజనులు చేయు ప్రచండప్రతిజ్ఞాపత్రికకు ఎవరుత్తరము నిత్తురు? శాస్త్రజ్ఞానవిహీనులైన వీరు సభయందు ఏ వాగ్యుద్ధమును జేయబూనెదరు! ఆహా! బాహుయుద్ధమును జేయుదురో ఏమో?

"ప్రెస్సు పేరుకూడ వేయనియ్యక గుప్తవృత్తితో ప్రకటించిన ఈ సవాలు పత్రిక దేశమునకంతటికిని అన్వయించునంతటి విలువకలదిరో, మార్కెట్టులోని వంకాయల సవాలు యొక్క విలువకలదిరో చదువరులే యూహింతురుగాక." అని వ్రాయబడియున్నది. ఇది అత్యన్తమయుక్తము. ఎట్లనగా—

క్రిందపేరు వేయక పత్రికను ప్రసిద్ధపరచినచో ఈ పత్రిక ఎవరిది యనుదానిని ప్రెస్సువారినడిగి తెలిసికొనుటకు ప్రెస్సుయొక్క పేరు వేయ నావశ్యకము. పత్రికను ప్రసిద్ధపరచినవారే తమ పేరును స్పష్టముగ వ్రాసియుండ "ప్రెస్సుపేరుకూడ వేయనీయక గుప్తవృత్తితో ప్రకటించియున్నారు" అను నిట్టి యాక్షేపమును మూర్ఖులుఁజేయుదురే గాని ప్రాజ్ఞులుఁజేయరు.

ప్రెస్సుపేరు వేసిననే దేశమునకంతటికిని అన్వయించును. పత్రిక ప్రసిద్ధపరచినవారి పేరు వేసిన దేశమునకంతటికిని అన్వయించదు. వంకాయలనమ్మెడి మార్కెట్టునకు మాత్రమన్వయించుననుటను వంకాయలదినువారు మాత్రమే తెలిసికొనదరేగాని శాస్త్రజ్ఞులు (వివేకులు) తెలిసికొనరు. ఇంతకు పత్రికలో ప్రెస్సుపేరు వేయకయుండుట ప్రెస్సువానితప్పే అని తెలుసుకొనని ఈ అన్నంభట్టులను ఏమనవలెను?

* ఓ బాహుశాలియగు బాలకుడా! ఏదో ఒక ఊరియందు శుభకరులైన ముగ్గురు రాజపుత్రులుండిరి. అయితే వారిలో నిద్దరు

---

* బాలస్య హి వినోదాయ ధాత్రీ వక్తి శుభాం కథాం। క్వచిత్ సన్తి మహాబాహో రాజపుత్రాస్త్రయశ్శుభాః। ద్వౌ న జాతౌ తత్రైకస్తు గర్భ ఏవ సచ స్థితః। వసన్తి తే ధర్మయుక్తా అత్యన్తానతి వర్తనే। వ్యకీయాచ్ఛూన్యనగరాన్నిర్గత్య విమలాశయాః। గచ్ఛన్తో గగనే వృక్షాన దదృశుః ఫలశాలినః। భవిష్యన్నగరే తత్ర రాజపుత్రా

పుట్టినేయుండ లేదు. మరియొకను గర్భమునందు వానమునే చేయ లేదు. ఆ ముగ్గురు ధర్మముగలవారై అత్యంతసత్యమగు పట్టణమున నుండిరి. శుద్ధాన్తఃకరణులగు నాగాజపుత్రులు తమ శూన్యనగరము నుండి వెళ్ళినవారై ఆకాశమునందు ఫలములతోనిండిన వృక్షములనుఁ జూచిరి. వేటనాడు నాముగ్గురు బిడ్డలు ముందు కలుగబోవు పట్టణ మున ఈ దినమే సుఖముగ వసించిరి. ఈ రీతిగ దాదిచే చెప్పబడెను. దీనిని విచారశూన్యమగు బుద్ధిచే ఆ బాలుడు ఎట్లు నిశ్చయమని తెలిసి కొనెనో అట్లే విచారశూన్యమగు బుద్ధిగలవానికి ఈ కథవలె సంసార రచనగూడ యుండును. అని విద్యారణ్యులు తముచే రచింపబడిన 'పంచదశీ' యను గ్రంథమునందు 'వేదాదిశాస్త్రములు, అద్వైతమత ము మొదలైన సమస్తమైన జగద్విచారము దాది బాలకునికి జెప్పిన కథవలె అసంగతములయినవి. అవివేకులచే తెలుసుకొనదగినదేగాని వివేకులచే తెలిసికొనదగినది గాదు" అని చెప్పియుండుటచే ఈశాస్త్రిం వారు చేసిన విచారమున్ను అసంగతముగనున్నందున ఇద్దానిని అవి వేకులు గ్రహించెదరు గాని వివేకులు గ్రహించరు.

ఈ సవాలు పత్రికాఖండనమును ప్రచురించిన తరువాత కల్యా ణానందభారతిని రహస్యముగా నభినందించి యెవరికిని తెలుపకయే గుంటూరికి పంపిరి. వీరు గుంటూరికిపోవునది యెట్లో తెలుసుకొని మ॥ రా॥ రా॥ శ్రీ లాం.గ్లే, యం. భీమసేనరావుగారు ఈ క్రిందివిధముగ

---

త్రయోఽపి తే । సుఖమద్య స్థితాః పుత్రా మృగయావ్యవహారిణః ॥ ధాత్ర్యేతి కథితా రామ బాలకాఖ్యాయికా శుభా। నిశ్చయం స యయౌ బాలో నిర్విచారణయాధియా ॥ ఇత్థం సంసారరచనా విచారోజ్ఝితచేత సామ్ । బాలకాఖ్యాయికా వేత్థమవస్థితిముపాగతా ॥ (మహోపనిషత్ పంచ దశ్యామ్.)

ప్రకటించి తత్క్షణము యందొక ప్రతిని రైలులో కూర్చుండియుండిన కల్యాణానంద భారతికి యిచ్చునట్లు చేసిరి. ఈ పత్రికనుచూచి ఆదవాని యందు జరుగు కలవరము నాపుటకు రైలులోవచ్చిన యీ మాంతా చారి హృదయమెంత కలవరమున కాకరమయ్యెనో యనునది అచ్చట నున్న జనులకే చక్కగ తెలిసియుండవచ్చును.

# సత్యమే జయము.

అద్వైతప్రబోధక సంఘము ఆదవాని, శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్లస్వామి, పౌరులకు ఆదవాని లాంగ్లే యం. భీమసేనరావు వ్రాసిన

# బహిరంగలేఖ.

అద్వైత సంఘములో ప్రముఖులు, జ్యోతిష్కులు, ఉపాధ్యాయులు, పండితులు, వకీళ్లు, వ్యాపారస్థులు, సత్య, అహింస, శమదమాది అమూల్య ధర్మములేప్రాధాన్యమువహించిన బ్రాహ్మణజాతిలో పుట్టినవారైన వీరు తామె స్వయముగా శ్రీ ఉత్తరాది స్వాములవారితో వాదమునకు యేర్పాటు చేసుకొనిపోయి, అట్లుమాట్లాడిన మాటకు కట్టుబడక తాము చేసిన తప్పును ఒప్పుకొనక తప్పునే ఒప్పని సాధించుచు తమకు జయమైనదని ఎదతట్టుకొని ఆర్భాటము చేయుట శోచనీయముగా నున్నది.

సదరీ సంఘము తరపున శ్రీయుత పుట్టప్ప రామచంద్రప్ప అను వారలు గుంటూరు స్వాములనుండి వచ్చిన తంతిని ఉత్తరాది స్వాముల వారికి ద్వైతాద్వైత విచారముల పరస్పర వాదోపవాదములుగా జరుపవలెనని యేర్పాటు చేసుకొని అప్రకారము తమస్వాముల

వారు ఒప్పినట్లు తెంతియిచ్చిరి. అదేదినము బ్రహ్మశ్రీ కథాసాగరం చితంబరభట్లు మాంతాచార్ల స్వాములకును ఉత్తరాది స్వాములకును ద్వైతాద్వైత విషయమున వాదోపవాదములు జరుగునను బహిరంగ లేఖలను యీ యూరియందే కాక తదితర గ్రామములకు పంపిరి. ఇట్లు యేర్పాటుచేసియు నిట్టిసభను యేర్పాటు చేయకుండుటయే కాక కూడు మిక్కిలి ఉత్తరాదిస్వాముల వారే రామచంద్రభట్లును పిలిపించి గుంటూరు స్వాములతో వాదము చేయుదుమని చెప్పినారనుట అసత్యమును అలౌకికమును తేటపడుచున్నది. ఇప్పుడుకూడ మించిపోలేదు అద్వైతసంఘప్రముఖులు తమగౌరవమును నిలువబెట్టుకోదలచిరేని వారు ఏకార్యక్రమమును తెలుపుదురో ఏ పణమును (లక్షరూపాయలుగాని అథవా పరస్పర మతముల మార్పులుగాని) నిర్ణయింతురో, ఏస్థలము ఏర్పాటుచేయుదురో మాకు తక్షణమే బహిరంగ లేఖ మూలకముగా వారిప్రముఖుల సంతకములతో తెలిపిన నేను మా స్వాములవారితో వారి కార్యక్రమమునకు ఒప్పించుచున్నానని ఇందుమూలకముగా ఘంటాపథముగా నందరిని హెచ్చరించుచున్నాను. అట్లు చేయనియెడల యీ అద్వైత సంఘమువారి సంతకమే గాక వారి స్వాములవారితోగూడ సంతకము చేయించి జయపత్రమును శ్రీ ఉత్తరాది స్వాములవారి సన్నిధికి ఖుద్దుగావచ్చి సమర్పించుట వారిధర్మము.

శ్రీ మాంతాచార్యస్వామి వారికి:—

మీరు మీసభలో, నేను మీదగ్గరకు ఉత్తరాదిస్వాములవారి తరఫున నుండి శీలువేసిన సవాలు పత్రికను తీసుకొనిరాలేదని మాత్రము చెప్పి నాతోమాట్లాడిన యితర విషయములు సభలోచెప్పక మీయట్టివారు దాచిపెట్టుట విని నాకుమిగుల సంతాపకరమైనది.

నేను తమ సన్నిధికి 3 రోజులువచ్చి, రోజును సుమారు 1, 2 గంటలు మాటలాడితిని. తాము ఆ మూడు రోజులును, వాదోపవాదములకు తాము రాలేదనియు అద్వైతోపన్యాసములను మాత్రము చేయ మమ్ములను [మాంతచార్లవారిని] పిలిపించినారనియు చెప్పితిరి. "అయి నను మా శిష్యుల పుద్దేశ్యములను బట్టి వాదోపవాదములు జరుపుటకు నాకు సామర్థ్యమున్నది. జరిపెదను. అయిన యీ స్వాములవారికి సివిల్ కేసు ఖండనలు రెండు పుస్తకములు శ్రీముఖమును పంపినాము." అనియు "అందుకు జవాబు వారినుండి గాలేదు" అనియు ఆమూడు పుస్తకములు నాకిచ్చి "దానికి జవాబు వచ్చునరకు వాదము సలు పను అని ప్రతిజ్ఞ చేసినాను" అని చెప్పితిరి. అందుపైన నేను "తా ముభయులు కలసినప్పుడు తత్ఖండనమే పరస్పర వాదరూపమున జరుప వలెను" అని ప్రార్థించగా మీరు "తపాలుద్వారా రావలెనే కాని పరస్పరము కలయనని చెప్పియూ మీసభలయందు జరిగిన విషయము పూర్తిగా చెప్పక యుండుట జూడగా అసత్యమే సిద్ధాంతముగా అంగీక రించిన యీ యూరి అద్వైత సంఘము వారి గాలి, మీకుకూడ సోకినదని నాకు స్పష్టమగుచున్నది. అయినను చింతలేదు. పై సంఘము వారికి వాదోపవాదముల విషయమై కార్యక్రమమును పణము స్థల నిర్ణయములు తమకుకూడ అన్వయించుచున్నవి. ఈప్రకారము మీరు సంసిద్ధులైతిరేని, మీస్వంత సంతకముతో నుండిన బహిరంగలేఖను ప్రకటింపవలయును. లేనిచో జయపత్రముమీరు స్వయముగా ఉత్త రాదిస్వాములవారికి నొసంగకపోవుట సనాతనధర్మముయొక్కయు అందునయతులకు మీయొక్కయు కర్తవ్యము కాదు మీరొకవేళ యీ ఊరిని విడిచినను మీపైనను ఈ యూరి అద్వైతి ప్రబోధక సంఘ ముపైనను మిగిలిన అద్వైతులపైనను యీ సవాలు కలదని మరల మరల మిమ్ములను హెచ్చరించు చున్నాను.

ఆదవాని పురమహాశయులారా!

ఈయూరియందు, ద్వైతాద్వైత చర్చల విషయము మీకంద రికి తెలిసియేయున్నది. ఈ విచారమున ఉభయవాదులలో, ఎవరు మొదట కార్యక్రమమునకు ఒప్పి వెనుక త్రొక్కుచున్నారో, యెవరికి జయమో, యెవరికి అపజయమో, యెవరిది సత్యమో, యెవరిది అసత్యమో తెలియునది మీకు అవశ్యకర్తవ్యము. పై వివరించిన కార్యక్రమమును, పణమును, స్థళమును ఏర్పాటు చేసినరీతిగా నేను ఒప్పికొని శ్రీఉత్తరాది స్వాములవారిని, వాదమునకు పిలుచుకొనివచ్చు జవాబుదారి నాదిగాఉన్నది. కనుక మీరైనను అద్వైత ప్రబోధక సంఘమువారినిగాని వారితరపున వచ్చిన శ్రీమాంతాచార్యస్వాముల వారినిగాని వాదోపవాదములకు ప్రోత్సహించి ఉభయులవాదములను వినుభాగ్యము కలుగజేసి పుణ్యము కట్టుకొనరాదా!

శ్రీయుత గట్టురాయప్ప శ్రేష్టిగారి యింటియందు, సదరు శ్రేష్టి యొక్కయు శ్రీ జాలావడి తిమ్మయ్య, రొట్టగల్లు శివప్ప శ్రేష్టియొక్కయు మః చొక్కనహళ్లి కృష్ణరావు వీరల సమక్షమందు, పైపవాలును అద్వైత సంఘములో ప్రముఖులగు బ్రహ్మశ్రీ కథాసాగరం చిదంబర భట్లు తొగర్చేడు భాస్కరశాస్త్రిలు, కె. కృష్ణరావు మొదలగు మమారు 20 మందికి, పైపవాలువేసి, బ్రహ్మశ్రీ భాస్కరశాస్త్రిలను వభానియమములను వ్రాసి శ్రీ గట్టురాయప్ప శ్రేష్టిగారికి నీయవలయు ననియు; అట్లు యియ్యబడిన కార్యక్రమమును తీసుకొని సదరీ గట్టు రాయప్పగారు నాతో శ్రీఉత్తరాదిస్వాములవారి దగ్గరకు రావలయు ననియు, అట్లు తీసుకొని రాబడిన కార్యక్రమమునకు శ్రీఉత్తరాది స్వాములవారి కిలును సంతకము పెట్టించుట, నాజవాబుదారియనియు

చెప్పితిని. అందులకు బ్రహ్మశ్రీ భాస్కరశాస్త్రి యొప్పుకొనక 12-వ శ్రీముఖమునకు జవాబిచ్చిననే కాని మేము మాట్లాడమని చెప్పి, యిప్పుడు లేనిపోని మాటలతో కాలక్షేపము చేయుట వీరిపాండిత్య ప్రాబల్యమును సత్యమునందు దృష్టిని వెల్లడించుచున్నది. ఇంతేకాక ఈ ఉభయస్వాములవారు కలియువిషయమున శ్రీజగద్గురు ప్రెసి మఠపతి శ్రీయుత రాచయ్యగారు ఈవిషయమున ఖుద్దున శ్రీమాంతా చార్య స్వామితో మాట్లాడిరి మ|రా|రా|శ్రీ అర్ధగేరి బసవగౌడుగారు వారిప్రముఖులతో మాట్లాడిరి. నేను శ్రీమాంతాచార్య స్వాముల వారితో ఖుద్దునమాట్లాడినప్పుడు అచ్చటనే యుండిన శ్రీయుత కొప్పరం వెంకటనరసయ్యగారుండిరి పైచెప్పిన వారిని అంతరంగమున అడిగిన నిజస్థితి స్పష్టముగా తెలియుచున్నది.

శ్రీమాంతాచార్యులవారు ఊరువిడిచి పోవుచున్నట్లు తెలియుచున్నది. ఇట్టిసందర్భమున వారు యిచ్చటికివచ్చిన కార్యమును వ్యవస్థ చేయకపోవుట వారికి నీతికాదు. వ్యవస్థఅగువరకు వారిచ్చటవుండుటన్యాయము' అట్లుచేయు నెడల వాదోపవాదములకగుఖర్చులు నేనేభరింతును ఈవాదోపవాదములు జ్ఞానదాయకములు పరస్పరవిరుద్ధములగు ద్వైతాద్వైతములు మోక్షసాధనములనుట అనుచితము దీనిలో నేదైన నొకటి యబద్ధముగానుండవలెను అద్వైతమతములో నిర్గుణసగుణ, నిష్క్రియ క్రియ భేద ఐక్య, యిట్టిపరస్పర ద్వంద్వభావముతో వుపాసించుటవలన మనస్సు డోలాయమానమై యుండి చిత్తశుద్ధికలుగుటలేదు, చిత్తశుద్ధిలేనిచో జ్ఞానముపుట్టదు జ్ఞానములేనిచో మోక్షము లభింపదు, దీనిలో జ్ఞానసాధనమేదియని కనుగొనుట మనకు విధియైయున్నది జ్ఞానసాధనమునకు ప్రతిబంధకమైన కోపతాపములకు యిందుతావులేదు

విస్మృత పారబుద్ధితో విచారము చేయవలసిన విషయమని అందరికి వినయ పూర్వకముగ మనవిచేసికొను చున్నాను.

ఇట్లు

అదవాని 30-12-35 } తమ మిత్రుడు,
లాంగ్లే యం. భీమసేనరావు.

---

తదుపరి 31-12-1935 నాడు శ్రీవారిని నభినందించుటకై క్రిందివిధమున ప్రచురించి ప్రకటించిరి.

శ్రీః

# ప్రకటన.

ఆర్యమహాశయులారా !

ఈదినము (31-12-1935) సాయంత్రము క్రింది కార్యక్రమము ననుసరించి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య త్యాద్యనేక గుణసంపన్నులును వైష్ణవసిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులైన జగద్గురు శ్రీమదుత్తరాది మఠాధీశులగు శ్రీ సత్యధ్యాన తీర్థ శ్రీపూజ్యపాదులవారికి ఆస్తిక జనస్తోమము అభినందన మొనరింతురు కావున చాతుర్వర్ణ్యముల వారందరు కార్యక్రమమున పాల్గొని కృతార్థులగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

కార్యక్రమము

(1) 4 ఘంటలకు లాంగ్లే భీమసేనరావుగారి భవనము నుండి శ్రీ వెంగళాపురాంజనేయస్వామి దేవాలయమునకు శ్రీస్వాములవారి విజయము,

(2) 4-30 నుండి 5-30 వరకు పండితోపన్యాసములు.

(3) 5-30 నుండి 6 వరకు అభినందన పత్రికా సమర్పణము

(4) 6 ఘంటలనుండి ప్రొసెషన్

ద్వైతసంఘప్రమోదినీసభ ఆదవాని ఇట్లు,

31—12—35 యం. భీమశేనరావు,

ప్రెసిడెంటు.

పై ప్రకటన మేరకు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యముల వారును నా సభయందు పాల్గొనిరి. కాశీ, పండరీపురము, తిరుపతి, సతారా మున్నగు ప్రదేశములనుండి వచ్చిన పండితప్రకాండులుపన్యసించిరి. తరువాత అభినందన పత్రి యీవిధముగా చదువబడెను.

శ్రీః

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యత్వాద్యనేక గుణసంపన్నులున్ను, సద్వైష్ణవ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులును, దిగంత విశ్రాంత కీర్తివిరాజమానులును, అద్వైతధ్వాంత భాస్కరులును, సకల వేదాంతశాస్త్ర పారంగతులును, జ్ఞానధనులును, శ్రీరామచంద్ర వేదవ్యాస పాదపద్మారాధకులును, శ్రీసత్యజ్ఞాన తీర్థకర కమలసంజాతులును శ్రీమదుత్తరాది మఠాధీశులును అగు జగద్గురు

# శ్రీ సత్యధ్యాన తీర్థ శ్రీ పూజ్యపాదారవింద సన్నిధానమున

ఆదవాని ద్వైతసంఘ ప్రమోదినీసభ వారు భక్తిపురస్సరవందన శతంబుతో తమ కృతజ్ఞతను వెల్లడిచేయుటకై సమర్పించిన

# అభినందన పత్రిక

---

గురూత్తమా !

శిష్యప్రశిష్యసంతతియందుం దమసహజమగు పరిపూర్ణానుగ్రహమునుంచి

పూరమునకు దిగ్విజయము చేసి మమ్మనుగ్రహించినందులకు మీ పూజ్యచరణకమలసన్నిధిని వందనసహస్రంబుల నర్పించుచున్నారము.

యతీంద్రా !!

శిష్యజనోద్ధరణమునకై శమశాస్త్రవిహిత ధర్మ ప్రతిపాదనమును శిష్యానుగ్రహార్థము మీ సచ్ఛాస్త్రసార ప్రవచనమును మీ బోధకతాశక్తిని, మీ దానశౌర్యమును, వీక్షణ మాత్రముననే యెట్టి సూక్ష్మవిషయమునైనను గ్రహించు యద్భుత ప్రతిభను, గంగా ప్రవంతివలె ననర్గళమగు మీ వాక్చాతురీగరిమను వర్ణించుటకు మేమెంతవారము.

మాయావాది గజపంచాననా !!!

జ్ఞానమార్తాండులగు మీరుదయించుటచే దుర్మతతిమిరములు పలాయనమయ్యెను. పండితశ్రేష్ఠులని పొగడొందు ప్రతిపక్షులు రూపుమాసిరి. దుర్వాది గజములు మీ వేదాంతోపన్యాస గర్జనములకు బెదరి దిగంతములకుఁ జెప్పకయే పారెను. ఆసేతుహిమాచల పర్యంతము ద్వైతదుందుభి మ్రోగెను. ఇట్లొనర్చిన మీ యద్భుత మహిమను కొనియాడ నెవరితరము.

జ్ఞాన తేజోనిధీ !!!!

మీ మహామహిమను మీ యసాధారణశక్తిని గ్రహింపని కొందరు మిమ్ముల డీకొనదలంచియు తుదకు ప్రచండ భాస్కరునిజూచిన ఘూకములవలె తలదాచుకొనిరని యెల్లరకు దెల్లంబయ్యె. సజ్జనులానందంబు నొందిరి.

కరుణాసముద్రా !!!!!

తమ సద్గుణములను బొగడ మేమెంతవారము మీ దర్శన లాభముచే ధన్యులమైతిమి తమ సహజమగు శిష్యవాత్సల్యముతో

ప్రశ్నను గ్రహించుటకు మేమెంతయుఁ గృతాంజలులై ప్రార్థించు చున్నారము.

ఇట్లు విన్నవించు
యుష్మదత్యంత ప్రియశిష్యులు

ఆదవాని
31-12-1935

ద్వైతసంప్రమోదినీసభ వారు

సభానంతరము, పురవాసులలో అద్వైతులలో కొందఱు తప్ప మిగిలిన వారందఱు శ్రీవారి సూరేగింపు ఉత్సవమున పాల్గొనిరి. భూసురుల వేదఘోషలు పిక్కటిల్ల, గాయకుల గానముల చెలరేగ వేత్రహస్తులు బరాబరులొనరింప, పండితులిటునటు శ్రీవారికి చామరములవైవ బహువిధ వాద్యవిభవములతో తదుత్సవము రాజవీథులందుఁ జేయఁబడి రాత్రి 11 గంటలకు సమాప్తి చేయబడెను. శ్రీవారు తమయనుగ్రహ సూచకార్థము చాతుర్వర్ణ్యములవారికి ఫలమంత్రాక్షతలనుగ్రహించి మరునటిరోజున ఆదవానిపురము వీడి హారి[illegible]మునకు విజయము చేసిరి.

ఉపసంహారము:—

మనుష్యుఁడెవఁడేకాని యోగ్యతకుఁదగని కార్యమునకుఁ బూనంగరాదు. శ్రుతిజ్ఞానము లేకున్న మాన సామాన్యశబ్దార్థజ్ఞానము కూడ లేనట్టి యిట్టి నిరక్షరకుక్షులు యద్వితీయపండితులని పేర్కొన్న శ్రీమదుత్తరాది స్వాములవారితో శాస్త్రచర్చకుఁగడంగుటతగదు. కొండను ఢీకొనుటయె కాకమతేమి? "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవశోభతే" యన్నట్లు తమకు సమానపీఠస్థులు ఇట్టివిచారమునకుఁగడంగిన శ్రీవారు విచారము చేసియుందురని నమ్మెదను. సంస్కృతభాషాజ్ఞానములేని యిట్టి సెట్టూరి నరసరామశాస్త్రి యవివేకపుఁబ్రాంతులకును శాస్త్రజ్ఞానము లేక "యెనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవ"

మాపురమునకు దిగ్విజయము చేసి మమ్మనుగ్రహించినందులకు మీ పూజ్యచరణకమలసన్నిధిని వందనసహస్రంబుల నర్పించుచున్నారము.

యతీంద్రా !!

శిష్యజనోద్ధరణమునకై శమశాస్త్రవిహిత ధర్మ ప్రతిపాదన మును శిష్యానుగ్రహార్థము మీ సచ్ఛాస్త్రసార ప్రవచనమును మీ బోధకతాశక్తిని, మీ దానశౌర్యమును, వీక్షణ మాత్రముననే యెట్టి సూక్ష్మవిషయమునైనను గ్రహించు యద్భుత ప్రతిభను, గంగా ప్రవంతివలె ననర్గళమగు మీ వాక్చాతురీగరిమను వర్ణించుటకు మేమెంతవారము.

మాయావాది గజపంచాననా !!!

జ్ఞానమార్తాండులగు మీరుదయించుటచే దుర్మతతిమిరములు పలాయనమయ్యెను. పండితశ్రేష్ఠులని పొగడొందు ప్రతిపక్షులు రూపుమాసిరి. దుర్వాది గజములు మీ వేదాంతోపన్యాస గర్జనములకు బెదరి దిగంతములకుఁ జెప్పకయే పారెను. ఆసేతుహిమాచల పర్యంతము ద్వైతదుందుభి మ్రోగెను. ఇట్లొనర్చిన మీయద్భుత మహిమను కొనియాడ నెవరితరము.

జ్ఞానతేజోనిధీ !!!

మీ మహామహిమను మీయసాధారణశక్తిని గ్రహింపని కొందరు మిమ్మూర్ఖుల డీకొనదలంచియు తుదకు ప్రచండ భాస్కరునిఁజూచిన ఘూకములవలె తలదాచుకొనిరని యెల్లరకు దెల్లంబయ్యె. సజ్జను లానందంబు నొందిరి.

కరుణాసముద్రా !!!!!

తమ సద్గుణములను బొగడ మేమెంతవారము మీ దర్శన లాభ మునచే ధన్యులమైతిమి తమ సహజమగు శిష్యవాత్సల్యముతో

యుష్మదనుగ్రహించుటకు మేమెంతయుఁ గృతాంజలులై ప్రార్థించు చున్నారము.

ఇట్లు విన్నవించు
యుష్మదత్యంత ప్రియశిష్యులు

ఆదవాని
31-12-1935

ద్వైతసంప్రమోదినీసభవారు

సభానంతరము, పురవాసులలో అద్వైతులలో కొందఱు తప్ప మిగిలిన వారందరు శ్రీవారి నూరేగింపు ఉత్సవమున పాల్గొని, భూసురుల వేదఘోషలు పిక్కటిల్ల, గాయకుల గానముల చెలరేగ వేత్రహస్తులు బరాబరులొనరింప, పండితులిటువటు శ్రీవారికి చామరముల వైవ బహువిధ వాద్యవిభవములతో తదుత్సవము రాజవీధులందుఁ జేయఁబడి రాత్రి 11 గంటలకు సమాప్తి చేయబడెను. శ్రీవారు తమయనుగ్రహ సూచకార్థము చాతుర్వర్ణ్యములవారికి ఫలమంత్రాక్షతలనుగ్రహించి మఱునాటిరోజున ఆదవానిపురము వీడి హరిహరమునకు విజయము చేసిరి.

ఉపసంహారము:—

మనుష్యుఁడెవఁడే కాని యోగ్యతకుఁదగని కార్యమునకుఁ బూనం గరాదు. శ్రుతిజ్ఞానము లేకున్న మాని సామాన్యశబ్దార్థజ్ఞానము కూడ లేనట్టి యిట్టి నిరక్షరకుక్షులు యద్వితీయపండితులని పేరొందిన్న శ్రీమదుత్తరాది స్వాములవారితో శాస్త్రచర్చకుఁ గడంగుటతగదు. కొండను ఢీకొనుటయే కాకమతేమి? "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవశోభతే" యన్నట్టు తమకు సమానవీరస్థులు ఇట్టివిచారమునకుఁగడంగిన శ్రీవారు విచారము చేసియుందురని నమ్మెదను. సంస్కృతభాషాజ్ఞానములేని యిట్టి సెట్టూరి నరసరామశాస్త్రి యవివేకపువ్రాఁతలకును శాస్త్రజ్ఞానము లేక "యెనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవ"

యును కల్యాణానందభారతీ మాంతాచార్యుల గడబిడలకు వారుత్తర మీయజాలరు. వీరి యవివేకపు వ్రాతలకు వారు నవ్వి యుందురు.

గ్రహచారము చాలక యీ సెట్టూరు నరసరామశాస్త్రి ఆద వానికి వచ్చి యుండెనుగాబోలు. జ్ఞానహీనులగు వాదవాని యద్వై తులు యీ యూరిపేరు వేసి ఈశాస్త్రిని శునశ్శేఫునిగా చేసిరిగాని తామెందులకు ముందుపడి వాదించి తమమతమును నిలువబెట్టుకొన ప్రయత్నింపరైరో తెలియకున్నది శాస్త్రజ్ఞానము గలవాడెవడును నిట్లు వెనుకంజ వేయడు. శ్రీస్వాములవారిని నిమిషమాత్రమున జయింపగలమని సందుగొందులయందు పామరుల యెదుట మాట లాడుటయే వీరికార్యమని యూహింపవలసియున్నది ఇట్టి గర్వాంధ భాస్కరప్పల తలలోపడిన యిట్టి సెట్టూరి నరసప్పలు ఇహపరములకు దూరలగుటయే గాని వేరుండదు.



